

కథలు

తుమ్మల

లక్ష్మీకాంతమోహన్

స్టీవ్ నెల్సన్

గేయాలు

కృష్ణశాస్త్రి

గోపాలం

చిరంజీవి

నాటిక

అనిసెట్టి

వ్యాసాలు

విద్వాన్ విశ్వం

# అభ్యుదయ

సచిత్ర సాహిత్య మాసపత్రిక


సంపుటి ౧ 1948 జనవరి సంచిక ౧


సంపాదకులు:

కొమర్రాజు వినాయకరావు

ప్రయాగ కోదండ రామశాస్త్రి



గౌరవ సంపాదకులు

మల్లంపల్లి సోమశేఖరశర్మ | పి. వి. రాజమన్నారు

దేవులపల్లి కృష్ణశాస్త్రి | తుమ్మల వెంకటరామయ్య

కొడవటిగంటి కుటుంబరావు

వెల ఆరణాలు

# ఇందులో





ముఖచిత్రం: మా. గోఖలే


Editor, Printer & Publisher: K. Vinayaka Rao
Secretary, Andhra Progressive Writers' Association, Governorpet,
Printed at Abhyudaya Press, Bezwada.

సంపుటి 2
సంచిక 2

అభ్యుదయ

జనవరి
1948

ఆంధ్రాభ్యుదయ రచయితల మాసపత్రిక

# మన సంస్కృతి: మద్రాసు ప్రభుత్వ కర్తవ్యం

ఈ మధ్య మద్రాసు రాష్ట్రప్రభుత్వం, మద్రాసు రాష్ట్రంలోని తమిళ, తెలుగు, కన్నడ, మళయాళ భాషలలోను; సంస్కృతంలోను 'ఆస్థాన కవుల'ను నియమించుతామని ఒక ప్రకటనచేసింది. ఈ ఆస్థాన కవులను ఎన్నుకొనుటలో మద్రాసు ప్రభుత్వానికి ఆయా భాషలలోని యూనివర్సిటీలనుండి ప్రముఖులు, ఇతర భాషాకోవిదులు సహాయపడ తారట.

ఆస్థానకవులను నియమించుటలో మద్రాసుప్రభుత్వం ఉద్దేశ మేమిటి? ప్రభుత్వ సమాచారపత్రిక 'రాష్ట్ర సమాచారము' చూస్తే, "రత్నాంబరంబు లే రాయడిచ్చు" అను చింతను కవులకు పోగొట్ట డానికి చేస్తున్నారా అని అనిపిస్తుంది. 'రాష్ట్ర సమాచారము' (1947 డిశంబరు 15-వ తేదీ) ఇలా అంటోంది:

"మానవుడికి ఆనందం కావాలి. ఆనందానికి ఉత్తమ సాధనం సాహిత్యం. సాహిత్యస్రష్టయగు కవికి నిరాందోళిత జీవనం ముఖ్యం. ఇవన్నీ ఆలోచించిన మీదటనే, పూర్వం రాజులు కవుల్ని తమ ఆస్థా నాలలో చేర్చుకొని పోషించడం జరిగింది." "......రాజరికాలుగల దేశాలన్నిటిలోను సాహిత్యం రాజపోషణలోనే పెంపొందింది. నేటికీ ఆంగ్లదేశంలో రాజరికమూ, సాహిత్యానికి రాజపోషణా వున్నాయి."

అందుచే "భోజుడు, శ్రీహర్షుడు, రాజరాజ నరేంద్రుడు, శ్రీకృష్ణ దేవరాయలు మొదలగువారు" లేని కొఱత దీ న తు ం ది కా బోలు. "తన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను చే గొ న డ ం తో పూర్వ ఔన్నత్యాన్ని వీలైనంత త్వరలో అందుకొనడంకోసం భారతదేశం ఏవిధంగా ఉరకలుపెట్టి ముందుకు దూకుతున్నదీ మద్రాసు ప్రభుత్వం వారి ఈ ఉత్తమ నిర్ణయం" వల్ల తెలియగలదట.

కాలచక్రం ముందుకు పరిభ్రమించుతోంది. కాని మనమద్రాసు ప్రభుత్వం చూపు వెనుకకే మరలుతోంది. రాజుల సంస్థానాధీశుల రోజులు పోతున్నాయి. వారితోబాటు వారి 'ఆస్థానాలూ' అంతరించుతున్నాయి. కాని 'స్వేచ్ఛాస్వాతంత్ర్యాలుచేగొన్నామని' చెప్పుకొనే మన ప్రభుత్వానికి మాత్రం పాతకాలపు రాజరికమన స్తత్వం మాత్రం పోవడంలేదు.

లేకపోతే ఈ అస్థాన కవు లేమిటి? ఏ బడిపంతులో ఏ ప్రూఫ్ రీడరో [illegible] చ్చుకునే 80 రూపాయల జీతం ఏమిటి? (ఆస్థానకవులకు సంవత్సరానికి వెయ్యి రూపాయలలిస్తారట!)

"సాహిత్య స్రష్టయగు కవికి నిరాందోళిత జీవనం ముఖ్యం" అని నిజంగా ప్రభుత్వమే తలచితే ఈముష్టి విదలింపులేమిటి? ఈనాడు మంత్రులు తీసుకున్న నెలజీతంలో సగంపాటి లేదేఇది.

ఆస్థానకవుల నియామకంలో పోటీలు కల్పించి తగవులను స్పర్ధలను కక్షలను రేకెత్తించుటకన్నా, మరొకటి జరగదని మాభయం.

ఆస్థానకవులు ఇతరత్రాకూడ [illegible]రచనలు నిరభ్యంతరంగా సాగించుకోవచ్చునని ప్రభుత్వం చెప్పింది. కాని ఆ పదవిలోనున్నవాడు వ్యక్తిగత స్వాతంత్ర్యాన్ని చాటుకోడానికి వెనుకంజ వేయకతప్పదు.

కవులస్థానం అస్థానాలలోకాదు. ప్రజలలో. ఈ నాటి ప్రజలలో ఆవరించిన అజ్ఞానాంధకారాన్ని పోగొట్ట డానికి కవులను కర్తవ్యోన్ముఖులనుగాచేయాలి. అందుకుమార్గం కవులను ప్రోత్సహించి ఉత్తమ

రచనలను బహూకరించడం. తమరచనలు అచ్చుముఖం చూడవేమో నన్న దిగులు కవులకు లేకుండా చేయడం తమకృషికి తగిన ప్రతిఫలం ప్రోత్సాహం లభించుతుందనే ఆశకల్పించడం ప్రభుత్వ ధర్మం.

# ఉత్తమరచనలన్నిటినీ బహూకరించండి

కాని ప్రభుత్వం ఇందుకు పూనుకుంటున్నదా? వివిధ భాషలలో వివిధ విషయాలమీద వ్రాసిన గ్రంథాలకు, తమిళ తెలుగు భాషల లోని ఉత్తమగ్రంథాలకు రు 500 చొప్పున; మళయాళ, కన్నడ భాష లలో వ్రాయబడిన ఉత్తమ గ్రంథాలకు రు 250 చొప్పున బహూక రించుతామని ప్రభుత్వం ప్రకటించింది. ఈ విషయాలను 12 అంశా లుగా విభజించి(ఇందులో రెండో, మూడో సారస్వతాంశాలు)అందులో ఆరు అంశాలకే ఈ ఏడాది బహూకృతులిస్తామని ప్రభుత్వం వివరించింది.

ఇది ఏమాత్రం సంతృప్తి కరంగా లేదు. బహూకరించే ధనాన్ని హెచ్చించాలి. ఒక్కొక్క శాఖలో ఏ ఒకరిద్దరికో బహుకరించుటతో సంతృప్తి పడక, ఉత్తమరచనలన్నిటికీ ప్రోత్సాహమీయాలి. ఉత్తమరచ యితలందరినీ సత్కరించాలి. అప్పుడే ప్రభుత్వ ఆశయంలో ఏమైనా కొంచెం ఔన్నత్యంఉంటే అది సిద్ధించుతుంది.

# పాత వాసనలు వదలాలి

ఆగస్టు 15 తో స్వాతంత్ర్యం లభించినదనుకొన్న మన ప్రభుత్వం ఇంకా పాతవాసనలను వదలలేదు. లేకపోతే ఎన్నడో మరణించిన కృతక భాషయే విద్యాలయములలో వాడవలెనా ? వాడుకభాషపై నిషేధం తొలగించడానికి ప్రభుత్వం ఎందుకుపూనుకోదు ? స్వతంత్ర జాతీయ భావిపౌరులుగ విద్యార్థులను ప్రబోధించే ఉత్తమరచనలు విద్యాలయా లలో ఎక్కడున్నవి ? అట్టిరచనలు చేయమని కవులను రచయితలను, చరిత్రకారులను విజ్ఞానవేత్తలను ప్రభుత్వంఎందుకు పోత్సహించరాదు?

# భాషా దేవికి సంకెళ్లు

ఒకప్రక్క కవులకు గౌరవమంటూ మరోప్రక్క నిషేధాల ద్వారా భాషాదేవికి సంకెళ్ళు వేయుట ప్రభుత్వానికి ధర్మంకాదు.

1922 ఏప్రిల్ 15 న నిషేధించబడిన గరిమెళ్ళ సత్యనారాయణ గారి "మాకొద్దీ తెల్లదొరతనము" అనేపాటపై నిషేధం తొలగించినందుకు సంతోషమే. (కాని శ్రీ సత్యనారాయణగారి దారిద్ర్య దేవతను నిషేధించడానికి ప్రభుత్వం పూనుకొంటే మరీ సంతసిస్తాము.) అలాగే అల్లూరి సీతారామరాజు చరిత్రపై నిషేధంకూడ పోయినందుకు కూడాసంతోషిస్తున్నాము

కాని అడ్వయిజర్ల ప్రభుత్వంలోనూ ఆ తర్వాతనూ మరికొన్ని నిషేధాలు జరిగాయి. ఆ నిషేధాలను తొలగించక పోవుటలో ప్రభుత్వ ఉద్దేశ మేమిటి ?

ఒకవైపున జమీందారీలను రద్దుచేస్తూ మరొకప్రక్కన ఆజమీందారీల దురాగతాలను వెల్లడించే "ముందడుగు" ప్రదర్శనంపై నిషేధం దేనికి ? బ్రిటిషు సామ్రాజ్యవాదుల కుటిల రాజనీతిని బట్టబయలుచేసే 'సిమ్లాభాగవతానికి' నిషేధం దేనికి ? స్వాతంత్ర్యంలభించినదంటూనే, స్వతంత్ర యోధుడు అమరజీవి అల్లూరి సీతారామరాజుగాధను (బుర్రకథను) గానంచేయడానికి నిషేధందేనికి ?

మనజాతీయత, మనసంస్కృతి, మనజాతి, మనకళలు పునరుజ్జీవనం పొందాలంటే ఔన్నత్యం చెందాలంటే ప్రభుత్వంఈ నిషేధాలను తొలగించాలి. పాత పంథాను విడనాడి విద్యాబోధనా పద్ధతులలో విప్లవపథం త్రొక్కాలి. కవుల దారిద్ర్యాన్ని పారదోలి వారి రచనలు ప్రజల కందుబాటులో ఉంచేటట్లు ప్రోత్సహించి, కవుల స్థానం ప్రజల ఆస్థానంలో ఉండేటట్లు చేయాలి. ఇదే మన ప్రభుత్వం కర్తవ్యం.

# వీరు గెలుస్తారు!

శ్రీ తుమ్మల వెంకటరామయ్య

తూర్పు తెల్లవారలేదు. ఇంకా మసకమసకగానేవుంది. మల్లారెడ్డిగూడెం పైకి పోలీసు - సిపాయి మూకలు వచ్చి పడ్డాయి. ఊళ్ళో అడుగు పెట్టీపెట్టకముందే ప్రజలడ్డంపడ్డారు. ఊరుఊరంతా కదిలింది. కాస్త చేతిలో సత్తువవున్న ప్రతివారూ — ఆడా మగా అనే భేదం లేకుండా - ముందుకురికారు. హోరాహోరి యుద్ధం జరుగుతోంది. ప్రాణాలగ చేతిలో పెట్టుకొని ముసలివాళ్లుమాత్రం ఇంట్లో కూచున్నారు.

ధాం! ధాం! అని తుపాకి కాల్పుల ధ్వనులు!

లూటీలు - మానభంగాలు!!

ఏడ్పులు — పెడబొబ్బలు - హాహాకారవాలు!!!

ఈ సందడిలో రంగమ్మ గోడవ ఎవరికి కావాలి? ఆవిడ కూతురుకు రోగ మొస్తేనేం, నొప్పి వస్తేనేం? ఎవరికి పట్టింది?

టక్! టక్! టక్!

పోలీసుల బూట్ల చప్పుడు విన వస్తూంది. గాభరాగా రంగమ్మ, కూతురి మంచంవద్దకు పరిగెత్తింది.

టక్! టక్! టక్!

ఈసారి అడుగులు [illegible]గా పడుతున్నాయి. పోలీసులు తన ఇంటిని సమీపిస్తున్నారు.

ఈలలు — కేకలు

"పకడో! పకడో!!"

గడగడ వణుకుతున్న కూతురు ఇక వణకడం మానేసింది. రంగమ్మ, కూతురు ప్రక్కనే చేరింది. తల పైకి ముసుగు వేసింది. గొల్లున ఏడ్వటం ప్రారంభించింది.

పోలీసులు వచ్చి పడనే పడ్డారు ఇంట్లో.

"అమ్మో! కూతురా! కూతురో

కూతురా!!" రంగమ్మ గోల పెడుతోంది.

"ఏయ్ బూఢీ! ఎవడైనా బద్మాష్ ఇటు వచ్చాడా?" గద్దరించాడొక పోలీసు.

"నన్నేంచేసి పోయావె కూతురా! నాకు దిక్కెవ్వరే కూతురా! నాకీ మాయదారి చెరలేంటి కూతురా!" రంగమ్మ శోకాలు హెచ్చాయి.

"ఏయ్! బూఢీ! నిన్నే. ఎవడైనా వచ్చాడా ఇక్కడికి" లాఠీ నేలకేసి బాదాడు మరో పోలీసు.

"నాకు తెలియదు నాయనో! నాయనో! నన్నైనా ఎత్తుకు పోలేకు దేవుడో! దేవుడా! నీకూతురేమైందంటే ఏమని చెప్పేది నాయనో! నాయనా"

రంగమ్మ రాగాలు తీస్తోంది.

పోలీసులు ఇల్లంతా కలియ వెతుకుతున్నారు. ముష్టి ముసలి దానింట్లో లూటీకికూడా ఏం కన్పించ లేదు.

"కొక్కురోకో" గంపకింద కోడి కూసింది.

తపీమని ఒక్క తన్ను తన్నాడు గంపను పోలీసాడు. కోడిని చంకలో పెట్టుకొన్నాడు.

"కన్న బిడ్డను పెంచినట్లు పెంచావు కోడిని తల్లో! తల్లి! నాకు నీవూ దక్కలేదు తల్లో. నీ కోడైనా దక్కలేదే తల్లీ"

రంగమ్మ, కూతురు మొగంపై మొగం పెట్టి ఏడుస్తోంది.

"కోడీ కావాలి — కూతురూ కావాలి రండీకో" వెకిలి నవ్వు నవ్వుతున్నారు పోలీసులు.

"నా కొంప కూల్చిపోయావు కూతురో! నా గుండెలో కుంపటి పెట్టావు కూతురో!"

రంగమ్మ కూతురుపై బోర్ల పడుకుని ఏడుస్తోంది.

"ఛోడ్ దో యే సైతాన్ కో" ఆజ్ఞాపించాడు కమాండర్!

వెకిలినవ్వు నవ్వుకుంటూ వెళ్ళిపోతున్నారు పోలీసులు.

రంగమ్మ రాగాలుతీస్తూ నేవుంది.

టక్! టక్! టక్!

ఆ బూట్ల చప్పుడు క్రమంగా దూరమవుతూంది. ఊళ్ళో వాళ్ళ ఏడుపులు, పెడబొబ్బలలో క్రమంగా ఆశబ్దం లీనమైపోయింది.

* * *

పూర్తిగా తెల్లవారింది.

రాజారెడ్డికి బాగా స్మృతి వచ్చింది. తనకి లీలగా ఒక్కొక్కటీ జ్ఞాపకంవస్తున్నాయి. ప్రజలకీ పోలీసు - సిపాయీల మూకలకూ హోరాహోరీ యుద్ధం జరిగింది. కొడవలిసిగాల్లా తన సహచరులు శత్రువులపైకి ఉరికారు. కాని ఏం లాభం! సాయుధులు వాళ్లు. నిరాయుధులు తాము. ఆయుధాలేవుంటే....

తుపాకిగుండుదూరి మోచేయి వంక చూచుకొంటున్నాడు రాజారెడ్డి. ఈ దెబ్బే తగలకుంటే ఈచేతి వడిసెలదెబ్బకు...మరెన్ని పిట్టలు రాలేవో...కళ్లుమూసుకొని ఏదో ఆలోచనలో పడ్డాడు.

"నాయనా! ఇవిగో పాలు."

రాజారెడ్డి కళ్ళుతెరిచాడు. కృతజ్ఞతా పూర్వకంగా ఆమె ముఖంవంక చూస్తూ ఎడంచేత్తో పాలు తీసుకొని తాగుతున్నాడు.

రంగమ్మ ఆకూఅలమూ ఏమేమో తెచ్చి కట్టుకడుతోంది. రాజారెడ్డిప్రక్కనే కూచుంది. ఆమె చూపులన్నీ ఆమె ప్రాణాలన్నీ ఆ కట్టుమీదనే వున్నాయి.

ఎందుకో రాజారెడ్డిఒళ్లు ఒక్కసారి పులకరించింది. ఎప్పుడూలేని భీతి ఒకసారిఆవరించింది.గద్గదికతో 'అమ్మా' అని అన్నాడు.

"అమ్మా!"

ఆ పిలుపు ఆమె గుండెలోతులను తలచి చూచినట్లయింది.

యువకసింహమయిన రాజారెడ్డి ఒక పసిపాపలా, అతనిపిలుపు శిశు ఆక్రందనంలా అనిపించింది. చెమ్మగిలిన కళ్ళు ఒత్తుకుంటూ 'ఏం బాబూ' అంది రంగమ్మ.

"మనవాళ్లెందరు చనిపోయారు? ఎందరికి దెబ్బలు తగిలాయి?"

రంగమ్మ ఆలోచనలో పడింది. సమాధానం ఈయలేదు.

"వాళ్లెంతమంది చనిపోయి వుంటారు?"

"ఆc. ఏమో తండ్రీ. కొన్ని శవాలను వాళ్ళే లారీలలో వేసుకపొయ్యారంట. ఇప్పుడిపుడే అందరూ చేరుకుంటున్నట్లుంది. ఇంకా తెలియలేదు ఎంతమందో."

రంగమ్మ హఠాత్తుగా మాట్లాడ్డంమానివేసింది. ద్వారం వంక చూస్తూంది. ముఖంలో ఏదో చెప్ప

రాని ఆవేదన, ఆందోళన కన్పిస్తోంది.

తదేకధ్యానంగా రంగమ్మవంక చూస్తున్నాడు రాజారెడ్డి. తల్లి ఒడిలోఉన్న తన చిన్నతనం జ్ఞాపకం వస్తోంది. తన కృతజ్ఞత తెలియజేయడానికి మాటలు పెకుబుకుట లేదు. కనుచూపులతోనే ఆమాతృమూర్తివంక చూస్తున్నాడు.

"నన్ను బ్రతికించిన నీరుణం ఎలా తీర్చుకోనమ్మా ?" రుద్ధ కంఠాన్ని పెకలించుకొని వచ్చాయి ఈ మాటలు.

'ఎందుకు నాయనా అంత లేసి మాటలు. ఇందులో ఏముంది నేం చేసింది."

"వాళ్ళకు తెలిస్తే నీ ప్రాణం తీద్దురు."

"ఏం తీస్తే, బాబు. నల్గురితో పాటు నేనూ. కాటికి కాళ్ళు చాచుకున్న మాకేం నాయనా. మీరు చల్లగుండాలి కాని మాదో లెక్కా ? మాబోటి బీదా బిక్కా కోసం ఎన్ని అవస్థ లు పడుతున్నారు. ఒక ఇల్లా-ఒక ఊరా-రాత్రీ-పగలు అనేది లేదు. ఎప్పుడామాయదారి ముండాకొడుకులు పొట్టను పెట్టుకుంటారో అని దిగులే కదా"

రంగమ్మ కంఠం కొంచెం వణికింది. కళ్ళనీళ్ళను తుడుచుకుంటూ ద్వారంవంక చూస్తోంది.

రాజారెడ్డిని మళ్ళీ విస్మృతువ క్రుంగదీసింది. పరధ్యానంగా కళ్ళు మూసాడు.

* * *

ఎంతమంది చనిపోయారో, ఇలాంటి తల్లులెంతమంది బలి అయ్యారో ! ఆ రాక్షసులకుచిక్కి ఎన్నిఅవమానాలు అమానుషాలకు గురి అయ్యారో! యుద్ధం అంతా ముగిసింది. ఆ ధునిక మారణ సామగ్రితో శత్రువు తాత్కాలిక విజయం సాధించాడు తనలాగే తనమిత్రులూ తప్పుకొంటున్నారు. ప్రజలంతా చెదరిపోతున్నారు. వెనక్కి-పోతూ సైతం ఎంతటి ఆత్మాభిమానం ! ఎంతటి వీర ఎత ప్రతిఘటన! ఆఅమ్మాయి తన వెంటబడుతున్న పిశాచాల్ని దూరాన వుంచే, మరోయువతిరక్షణకు పూనుకొంది. ఒకటి రెండు వడిసెల విసుర్లకే ఒకడి కన్నుపోయింది. మరొకడి దవడ పగి

లింది. ఈ పిల్లనువదలి ఆ రాక్షసులు ఆమె వైపుకే పరుగెత్తుతున్నారు. ఆమె పరుగెత్తలేక ... చివరకు నడిచే స్థితిలోకూడ లేక, పాపం, ఏం దెబ్బతగిలిందో, అంత నిస్సత్తువగావుంది. ఎంతసాహసాన్ని ప్రదర్శించింది! తన తుపాకిలో గుండ్లయిపోయాయి. తన చెయ్యే పనికిరాకుండా పోయింది. లేకపోతే ఆ వెధవల్ని ......

పండ్లు పటపటా నూరుతున్నాడు రాజారెడ్డి. కళ్లు విప్పి చూచాడు. వడిసెలతో ప్రతిఘటించుతూన్న ఆస్త్రీ మూర్తి తన ప్రక్కనే కూర్చున్నట్లువుంది. మళ్లీ కళ్లు మూసుకొన్నాడు. మళ్లీ తెరిచాడు.

"ఏంనాయనా అలావున్నావు" రంగమ్మ ఇంకా తన ప్రక్కనే కూచునివుంది.

"అమ్మా నీకు సంతానం వుందా ?"

"వుంది"

"కొడుకులా, కూతుళ్ళా, ఎంతమంది, వారెక్కడ ?"

గబగబా ప్రశ్నిస్తున్నాడు రాజారెడ్డి. హృదయం ఉద్వేగంతో కొట్టుకొంటోంది. జవాబు కోసం ఆమె ముఖం వంక చూస్తున్నాడు.

"ఉన్నది ! ఒకే కూతురు"

పెకుబుకుతూన్న దుఃఖాన్ని బలవంతంగా దిగమ్రింగుతూ జవాబిస్తోంది రంగమ్మ. ఆమె కళ్ళు చెమ్మగిలినయి. ద్వారంవంక అర్థంలేని చూపులుచూస్తూ ప్రతిమలా కూర్చునివుంది.

రాజారెడ్డిమానసికంగా ఎంతో ఆందోళన పడుతున్నాడు. పదేపదే అదే మూర్తి అతని కళ్ళముందు తిరుగుతూంది. చింతనిప్పుల్లాంటి కన్నులు.... పండ్లు బిగించి కొరుకుతున్నదేమో నెత్తుటి బొట్టుతో తడిసిన పెదవులు... గిరగిరా తిరుగుతున్న ఆ వడిసెల... ముమ్మూర్తులా ఇలాగేవుంది.

"ఆమె నీకూతురు కాదుగదా?" అని ప్రశ్నిస్తున్నాడు రాజారెడ్డి. కాని మనస్సులోనే. ఆ మాటలు పెదవిదాటి రావడంలేదు. అతనికి సాహసం లేకపోయింది. "ఆమె నీకూతు రేనా ?" అని అడగడానికి.

"అమ్మా ఇక నీపనిచూసుకో. మావాళ్ళు త్వరలోనే వస్తారు"

"చూచుకోడానికి ఏముంది నాయనా! అసలు ఉందో లేదో, మీరు బ్రతికి బాగుంటేనే మా కొక బ్రతుకుదెరువు. తాతముత్తాతలనాటినుండి పడుతూన్న చెరలు ఇక ఇంతటితో పోతాయిబాబూ. మీరు గెలుస్తారు! ఎప్పటికయినా గెలుస్తారు! నాకింకేంపనినాయనా .... నా కింకేంపని?..."

ఒక్కొక్క మాటే గొంతు పెకల్చుక వస్తున్నది. ఎంత లోతు నుండి వెలువడుతోందో తెలియదు ఆమాట. రాజారెడ్డి ఒడలు పరవశమౌతోంది. రక్తం ఉడుకులెత్తుతోంది.

* * *

రంగమ్మ వీధివంక చూస్తూ వుంది. ఒక్కొక్కరే జనం అంతా వస్తున్నారు. దైన్యంతో కొందరు ముఖాలు వంచుకు నడుస్తున్నారు. పడిపోయిన తమ బిడ్డల్ని, చనిపోయిన తమ పిల్లల్ని, తలచుకొని కుమిలిపోతున్నారు. వాడి బాకుల్లాంటి చూపులతో పండ్లు పట పట కొరుకుతూ నడుస్తున్నారు మరికొందరు.

రంగమ్మ ఇంటి వాకిలిముందు జనం ఆగారు. శవాన్ని క్రిందికి దించారు. చుట్టుప్రక్కలవాళ్లంతా గొల్లుమన్నారు. ఒక్క గంతులో రంగమ్మ తనకూతురు శవందగ్గరకు చేరింది. రాజారెడ్డి పడుతూ లేస్తూ తూలుతూ అక్కడికి చేరాడు.

"ఆఅమ్మాయే-ఈవిడ, వడిసెల బుచ్చుకొని ...." మాటలు త్వరగా రావడంలేదు రాజారెడ్డికి-

"మీరిలా వచ్చేముందేనట. రోగిష్టి అయినా కూతుర్ని మంచం నుండి లేపి బయటకు పంపింది రంగమ్మ. ఇంతట్లోనే పోలీసులు వచ్చిపడ్డారు. స్పృహతప్పిపడ్డ మీ మీద ముసుగు కప్పి ఏడ్చింది."

ఎవరో చెబుతున్నారు గడిచిన గాథ అంతా.

"ఆ పిల్లమాత్రం, అంత బలహీనంగా వుండికూడా...ఎక్కడ నుండి వచ్చిందో ఆ సత్తువ... ఒక్క దెబ్బకు ఆ రాకాసి ముండా కొడుకుల కన్నొకటి దవడొకటి పోగొట్టింది. మూడో దెబ్బ కొడుతుండగా తుపాకి గుండుకు గురియైంది. పాపం! అప్పుడు రంగమ్మ

కేం తెలుసు నిజంగా తనకూతురు పోతుందని"

ఎవరెవరో ఆమె శౌర్య ప్రతాపాలను వర్ణిస్తున్నారు.

"నిజంగా నీవు వీరమాతవమ్మా! నీఋణం..." రాజారెడ్డి అంతకన్న ఇక మాట్లాడ లేక పోయాడు. తను ఇంతసేపూ చిత్రించుకుంటున్న, తన కళ్ల ముందు ఇంతసేపూ ఆడుతున్న వ్యక్తి రంగమ్మ కూతురే అయినందుకు ఒకప్రక్క విచారం మరో ప్రక్క గర్వము అతన్ని ముంచెత్తు తున్నాయి.

"తెలియకేం... .. నాకు తెలుసు... ఇలా జరగక తప్పదని తెలుసు... మన బ్రతుకుకు ఇంకో దోవలేదని తెలుసు..."

ఇంతకన్న మరోమాట పెగల లేదు రంగమ్మ నోటినుండి.

రాజారెడ్డి, శవం ముఖంపై గుడ్డ తీశాడు. ముఖంపై చేయివేశాడు. బిగించిన పెదవులు, నోటివెంట రక్తపుధారలతో తడిసిన నల్లనయిన పెదవులు చేతితో తుడుస్తున్నాడు.

"నాకు తెలుసు, ఇలా జరుగుతుందని!"

ఆమెకళ్ళు చెమ్మగిలలేదు!

ఆమె కళ్ళల్లో చూస్తే పాతాళపు లోతులు తడవి నట్లుంది!

రంగమ్మ రాగాలు తీయడం లేదు!

రంగమ్మ శోకాలు పెట్టడం లేదు!

ఆమె రగిలి రగిలి మండిన వరికుప్పలా కూలిపోయింది!

# మానవుడా!

— శ్రీ నార్ల చిరంజీవి —

లేచి రమ్ము
మేల్కొన్నది నవ యుగమ్ము
లెమ్ము సఖా !
మరు భూముల రాలి పడిన
మానవుడా !
బ్రతుకు కాలి గతులుమాలి
తెర చాటున పరచుకొన్న
నీ బ్రతుకుల నిష్ఠురతలు
వ్రాసేందుకు పాడేందుకు
నా కవితలు !
నా గొంతులు !—
మరు భూముల రాలి పడిన
మానవుడా !
మూగ వడిన నీ గాథలు
లోకానికి వినిపిస్తా !
లేచి రమ్ము
విజయభేరి మ్రోయ లెమ్ము
లెమ్ము సఖా !
పొలిమేరల నడి బీడుల
హాలికుడా !
బ్రతు కంతా ముక్కలుగా
చాకి రేవు బండలుగా

యుగ యుగాల స్మృతులుగా
పొగిలిన, నీ ప్రతిబింబం
నా గీతం !
నా కంఠం !—
పొలిమేరల, నడి బీడుల
హాలికుడా !
పదు నెక్కిన నాగలితో
లోకాన్నే దున్నిస్తా!
లేచి రమ్మ
విశ్వరూప మెత్తిరమ్మ
లెమ్మ సఖా !
రణ భూముల కనుమూసిన
సైనికుడా !
నీ రుధిరం, నీ ప్రాణం
ఒక తృణమై, ఒక పణమై
సామ్రాజ్యం, స్వాతంత్ర్యం
సాధించిన రణ మంత్రం
నా హృదిలో
వినదించెను!—
చరిత్రలో స్థలం లేని
సైనికుడా !
నీ విలపలు పోత పోసి
లోకంలో నడిపిస్తా !
లేచి రమ్మ
అవతరించె నవ జగమ్మ
లెమ్మ సఖా !
లోకం వొడిలో జారిన

పసి పాపా !
కాచుకొన్న రేచులాగ
భవితవ్యపు బంధనాలు
ఉరిత్రాళ్లయి వ్రేళ్లాడే
నరలోకపు శాసనాలు
నా చూపుల
దాటలేవు!—
నోరెరుగని దారెరుగని
పసిపాపా !
నీ నవ్వుల వెన్నెట్లో
లోకాన్నే కరిగిస్తా !
లేచి రమ్మ
నవపథాన నడిచిరమ్మ
లెమ్మ సఖా !
పొగల సెగల బుగిలిపోవు
పనివాడా !
నీ గుండెల తోరణాలు
మృత్యుదేవి మెడల నిండె,
నీ రుధిర స్రవంతు లెగసి
నిఖిల జగతి నిండి పొరలె
నా నీడల
పెరిగి రమ్మ!—
పొగల సెగల బుగిలి పోవు
పనివాడా !
నీ అడుగుల జాడలో ఈ
లోకాన్నే నడిపిస్తా !

# సారస్వతం - కళలు ఎవరికి ?

రచన:
మా - సి - యంగ్

అనువాదం:
శ్రీ కొండేపూడి
లక్ష్మీనారాయణ

మన విప్లవకార్యక్రమంలో కళ ఒక భాగంగా వుండాలి. అయినప్పుడే మనం మన ప్రజల్ని ఐక్యపరచగలం. వారి విజ్ఞానాన్ని పెంపొందించగలం. మన శత్రువుల్ని ఎదుర్కోగలం. సవాలుచేసి అతని ఆయుధాల్ని నిరుపయోగంగా చేయగలం. ప్రజలంతా ఒకే ఆశయంతో శత్రువుతో పోరాడేందుకు సహాయపడగలం. ఈ ఆశయసాధనలో మనం అనేక సమస్యల్ని పరిష్కరించవలసి వుంది. మన స్థానమెక్కడ? మన దృక్పథమేమిటి? మన ప్రేక్షకులెవరు? మన విజ్ఞానాన్ని పెంపొందించుకోవటం ఎలాగ? అనే ప్రశ్నలు మనల నెదుర్కొంటాయి.

••• ••• •••

మన స్థానమెక్కడనే సమస్యతో పాటు వివిధ ప్రత్యేక పరిస్థితులలో మనం అవలంబించవలసిన దృక్పథం ఏమిటనే సమస్యకూడ వస్తుంది. ఉదాహరణకు దేనినయినా ఎప్పుడు పొగడాలి, ఎప్పుడు తెగడాలి? ఇది దృక్పథానికి సంబంధించిన ప్రశ్న. ఈ రెండూ అవసరమనే అంటాను. కాని ఏది చెయ్యాలి అనేది ఆయా పరిస్థితులనుబట్టి, విషయాన్ని బట్టి వుంటుంది. మనకి మూడురకాల మనుష్యులున్నారు: (1) మన శత్రువులు (2) మనమిత్రులు (3) మనం (మనం అంటే కార్మికవర్గమూ, దాని ప్రథమశ్రేణియైన కమ్యూనిస్టుపార్టీ) ఈ మూడురకాల మనుష్యులపట్ల మూడురకాలయిన దృక్పథాలను మనం అవలంబించవలసి వుంటుంది.

మన శత్రువుల విషయం తీసుకుందాం. (శత్రువులంటే జపానువారు, ఫాసిస్టులు, ఇంకా ప్రజాశత్రువులైన ఇతరులూ.) వీరిని మనం పొగడాలా? ఎన్నటికీ కాదు. వీరంతా మానవ నాగరికతకే శత్రువులు. గనుక వారినిపొగడవలసిన అవసరం రానే రాదు. టెక్నికల్ గా చూస్తే వాళ్ళకి మనకంటె ఎక్కువ బలమే వుండవచ్చు. మనకి అన్ని ఆయుధాలులేవు. మనంచేయవలసిన పనులల్లా వాళ్ళచేతుల్లోనుంచి వాటిని లాగి వాళ్ళకి ఎదురుతిప్పడమే. అదేసమయంలో మన వైజ్ఞానిక సైన్యం కూడా ఒక కర్తవ్యాన్ని నెరవేర్చవలసివుంది. శత్రువు చేసే అత్యాచారాల్ని, దుర్మార్గచర్యల్ని ఎప్పటికప్పుడు బయటపెడుతూవుండాలి.

వాడి పరాజయం ఎలా తథ్యమో ప్రజలకు విశదీకరించాలి. అభివృద్ధికరశక్తుల కన్నిటికీ ప్రోద్బలమివ్వాలి. సత్వర విజయంకోసం ప్రజలంతా ఒకే హృదయంతో, ఒకే ఆశయంతో పోరాడేటట్లు చేయాలి.

ఇక మన మిత్రుల విషయం: వీరిపట్ల మన దృక్పథం ఎంతసేపూ వారిని ఐక్యపర్చేదిగాను, విమర్శల ద్వారా వారి తప్పులను సరిదిద్దేదిగాను వుండాలి. శత్రువును ప్రతిఘటించే వారి చర్యలను బలపర్చాలి. వారు సాధించిన ఘనకార్యాలను అభినందించాలి. అలా అని వారిలో కొందరు కమ్యూనిస్టు వ్యతిరేక, ప్రజావ్యతిరేక పద్ధతుల నవలంబిస్తే వూరుకోవాలని కాదు. అలాంటి చర్యలను ఖండించాలి. వారు రోజు రోజుకూ విప్లవ వ్యతిరేక మార్గానికి ఎలా దిగజారుతున్నారో స్పష్టంచేస్తూ వుండాలి.

పోతే ఇక మన కార్మికవర్గమూ, దాని పోరాటం వున్నాయి. సహజంగా వీటిపట్ల మన దృక్పథం వాటిని పొగిడేదిగా వుంటుంది. అయితే వీరిలో పొరపాట్లు వుండవా అంటారు. వుంటాయి. దీనికి కారణం కార్మికవర్గంలో కూడా పెటీ బూర్జువా స్వభావం కలిగిన వ్యక్తులు చాలమంది వున్నారు. పైగా, కొందరు రైతులూ ఇంకా వెనకబడి వుంటారు. తమ ఆలోచనలలో పెట్టీ బూర్జువా ధోరణులను కలిగివుంటారు. మన పోరాటంమీదవున్న భారాలలో ఇదికూడ ఒకటి. దీనిని మనం తొలగించుకోవాలి. క్రమక్రమంగా వారిని విజ్ఞానవంతులను చేయాలి. వారంతటవారు త్వర త్వరగా అభివృద్ధిచెందడానికి వారికైనున్న ఈభారాన్ని తొలగించుకోడంలో వారికి మనం సంపూర్ణంగా తోడ్పడాలి. ఇప్పటికే మన పోరాటాలు వారిలో మార్పును తీసుకు వస్తున్నాయి. వారు తమ భావాలను మెల్లగా మార్చుకోడానికి మొదలు పెట్టారు. మన రచయితలూ కళాకారులూ ఈ మార్పును తమ తమ రచనల్లోను ప్రదర్శనాలలోను చిత్రించాలి. అంతేకాని వాటికి దూరంగా ప్రేక్షకులలాగ కూర్చొని చూస్తూ, వారి పొరపాట్లను పట్టుకుని ఎగతాళి చేస్తూ వుండకూడదు. ప్రజలలోవచ్చే అభివృద్ధిని చక్కగా వర్ణించడంద్వారా ప్రజాసామాన్యంలో ఐక్యతను నిర్మించడానికి తోడ్పడాలి. అటువంటి వర్ణనలు ప్రజలనింకా ముందడుగు వేయించుతాయి. విప్లవపోరాటంలోకి ఎక్కువమందిని తీసుకవస్తాయి. వారిలోవుండే అజ్ఞానాన్ని తొలగిస్తాయి. ప్రజలలో అణగివుండే విప్లవశక్తిని రేకెత్తించుతాయి.

... ... ...

మనం సృష్టించే కళలు కార్మికులకోసం, కర్షకుల కోసం, సైనికులకోసం, మన అభిమానుల కోసం కనుక, వారిని అర్థంచేసుకోడం, విషయాలను వారికి ఎలా చెప్పాలి అనే సమస్య ఎదుర్కొంటుంది.

ఈ సందర్భంలో మన రచయితల్ని, కళాకారుల్ని ఒక ప్రశ్న అడుగుతాను. పై కర్తవ్యాన్ని నెరవేర్చడానికి ఇంతవరకు మీరు చేసిన దేమిటి? ఈ ప్రజలతోను, ప్రేక్షకులతోను మీకు పరిచయం లేదని నేనంటాను. మీరు వారిని అర్థం చేసుకోడంలేదు. మీరు రణరంగంలోని

వీరులు. మీరు సృష్టించే పాత్రలతో గాని, మీరు చిత్రించే పరిస్థితులు సన్నివేశాలతో గాని, కనీసం ఇవన్నీ మీరు యెవరికోసమైతే తయారుచేస్తున్నారో ఆ ప్రజలతో గాని మీకు ఏమీ పరిచయంలేదు.

మొట్టమొదట మీరు ప్రజల భాషను అర్థం చేసుకోవాలి. మీరు మీ రచనలలో ఎంతసేపూ విద్యావంతుల హెచ్చుస్థాయి భాషను వాడుతారు. ప్రజ లుపయోగించే సామాన్య భాషకీ, మీరు రాసేదానికీ ఎక్కడా లంగరు అందదు.

ప్రజల భాష ఏమిటో మనకి తెలియకుండా మనం వారితో సారస్వతాన్ని గురించీ, కళలను గురించీ మాట్లాడే దేమిటి?

మిమ్మల్ని "రణరంగం లేని వీరులు" అని అంటున్నా నంటే దాని ఉద్దేశం ఇది. మీ సిద్ధాంతాలను ప్రజాసామాన్యం అర్థం చేసుకోలేదు. పెద్ద రచయితలమనీ, పెద్ద కళాకారులమనీ, మీ గొప్పతనాన్ని నిరూపించుకొని వీరుల్లాగా చలామణీ అవుదామని మీ సారస్వతాన్ని, కళలను, మీ భావాలను ఎంత ఎక్కువగా ప్రజలలో అమ్ముకోడానికి ప్రయత్నిస్తారో, అంత యెక్కువగాను ప్రజలు వాటిని నిరాకరిస్తారు. మిమ్మల్ని ప్రజ లర్థం చేసుకోవాలంటే, మీరు ప్రజలలో ఒక భాగంగా కలిసిపోవాలంటే మీరా పద్ధతుల్ని మార్చుకోవాలి. మూసలో కరిగే లోహంలాగా ఎంతో కష్టతరమైన, సుదీర్ఘమైనపద్ధతిలో మార్పుచెంది నిగ్గుతేలడానికి మీరుతయారు కావాలి. మీ రా నిశ్చయానికి రావాలి.

* * *

మనం వ్యాప్తిలోకి తీసుకువచ్చే విజ్ఞానం ఏమిటి? ఫ్యూడల్ విజ్ఞానమా? బూర్జువా విజ్ఞానమా? లేక పెటీ బూర్జువా విజ్ఞానమా? ఇవి ఏవీ కావు. మనం దేనినయినా ప్రజాసామాన్యంలో వ్యాప్తిలోకి తీసుకు రావాలంటే అది వారి విజ్ఞానం ద్వారానే చేయగల్గుతాం గాని మరోవర్గ విజ్ఞానంద్వారా కాదు. అందుచేత కార్మిక కర్షకుల్ని, సైనికుల్ని విజ్ఞానవంతులను చేయాలనే కార్యక్రమానికి పూనుకోడానికి ముందు మనం వారి వద్దనుండి సంగతులను నేర్చుకోడమనే పనిని పూర్తిజేసుకోవాలి.

గనులలో ముడిపదార్థంలోనుంచి మంచి లోహాన్ని తీసినట్లుగా ప్రజాజీవితంనుంచి ఉత్తమ సారస్వతం, కళలు రాబట్టవచ్చు. ప్రాథమిక దశలో అవి ప్రాచీనంగాను మోటుగాను వున్నప్పటికీ, కొల్లలుగా ప్రజాజీవితంలో మన కవి లభిస్తాయి. ఇక్కడ మనకొక అంతులేని గని వున్నదన్న మాట. ఆ గనిలోనుంచి మనం ఎంతయినా త్రవ్వితీసుకోవచ్చు. అది అక్షయం.

పుస్తకాలుగాని, యితరత్రా లభ్యమయ్యే వైజ్ఞానిక స్వరూపాలుగాని గనులు కావు. గనులనుండి తీయబడిన సరుకులు మాత్రమే. మన తాత ముత్తాతలు, విదేశ రచయితలు, కళాకారులు, వాటిని తయారుచేశారు. వారివారి కాలాల్లో ఆనాటి సమాజంలో ప్రజాజీవితంనుంచి సారస్వతం, కళలూ ఎలా ఉద్భవిస్తాయో తెలిసినవారు వాటిని తయారుచేశారు. వాటినుంచి మనం కొంత తీసిపారేయవచ్చు. అద్దంలో ముఖం చూచుకొన్న

తరువాత అద్దాన్ని అవతల పెట్టినట్లు మనకు కావలసిన విషయాలను చూచుకొన్న తరువాత వాటినొక ప్రక్కను పడేయాలి. మనకాలంలో మన సమాజంలో ప్రజాజీవితాన్నుంచి సారస్వతాన్ని కళలను తయారుచేయటానికి అన్వయాలుగా మాత్రమే ఆ గ్రంధాలను వుపయోగిస్తాం. నిజం చెప్పాలిసివస్తే అలాంటి ఎరువు అద్దాలలో చూచామా లేదా అనేది ప్రధానంకాదు. దానివలన మనకు తెలిసేదల్లా నాగరికతకీ అనాగరికతకీవున్న తేడా సంస్కరింపబడిన దానికీ మొరటుదానికీ వున్న తేడా. వున్నతస్థాయిలో వున్న దానికీ, నిమ్నస్థాయిలో వున్న దానికీ వున్న తేడా. సహజంగా మన పూర్వులూ, విదేశస్థులూ తయారుచేసిన ఈఅద్దాన్ని మనం తిరస్కరించం అది ఫ్యూడల్ వర్గానికిగాని, బూర్జువా వర్గానికిగాని చెందివున్నప్పటికి మనం దాన్ని త్రోసిపుచ్చం. కాని ఒక విషయంమాత్రం గుర్తుంచుకోవాలి. నేటి ప్రజాజీవితాన్నిగూర్చి మనంచేసే పరిశోధనలకి బదులుగామాత్రం దాన్ని ఉపయోగించకూడదు. అదిఉపయోగపడదుకూడా. ఎందుకంటే నేటిపరిస్థితిని, గతించిన కాలం ప్రతిబింబింప జాలదు. ఈ విచక్షణ లేకపోయినా, దానిని గుడ్డిగా అనుకరించినా, లేదా యిప్పుడున్న దానికి బదులు ఆ మృత విజ్ఞానాన్నిగాని విదేశ విజ్ఞానాన్నిగాని తెచ్చిపెట్టినా అది చాలా ప్రమాదానికి దారితీస్తుంది. మన సారస్వతంలోను, కళలలోనూ నిరుపయోగమైన మొండివాదనలను తెచ్చిపెడుతుంది.

అందుచేత విప్లవరచయితలు, కళాకారులు తదితర వైజ్ఞానిక వర్కర్లు ప్రజాసామాన్యంలోకి వెళ్ళాలి. ఆ వెళ్ళడమనేది హృదయపూర్వకంగాను ఏవిధమైన సంకోచాలు, షరతులు లేకుండాను ఎక్కువకాలం ప్రజలమధ్య పనిచేయడానికి సంసిద్ధంగానూ వెళ్ళాలి. అగ్నిపరీక్షలవంటి పోరాటాల్లో వెనుకాడకుండా నిలబడి పోరాడాలి. అంతులేని ప్రజాజీవితమనే గనియొక్క లోతులు చూడాలి. అన్నిరకాలప్రజల్ని సంఘంలో అన్ని తరగతులవారినీ, వారి జీవితాల్ని వారి పోరాటాన్ని వారిలో ద్యోతకమయ్యే రకరకాల విజ్ఞానాన్ని పరిశీలించాలి. పరిశోధించాలి. అవగాహనం చేసుకోవాలి. అలా చేయగలిగినప్పుడే నూతన విజ్ఞానాన్ని సృష్టించి తయారుచేసే విధానంలో ప్రవేశించగలుగుతాం......

ప్రజాసామాన్యంలో ఎక్కువ వ్యాప్తి చెందిన సారస్వతం, కళలూ సంస్కరింపబడిన సారస్వతం, కళలూ, ఈ రెండూ కూడా తయారుచేయబడినవే. అయితే ఈ రెండింటికీ వున్న తేడా ఏమిటి? అది తరతమ భేదం తప్పితే మరొకటి కాదు. ప్రజలలో ఎక్కువ వ్యాప్తిచెందిన సారస్వతం, కళలూ, ఎక్కువగా తయారైనవి కావు. అవి కొంతవరకు మోటుగా వుంటాయి, వున్నప్పటికీ, ప్రజాసామాన్యంచే తొందరగాను, సులభంగాను అర్థం చేసుకోబడేటట్లుంటాయి. ప్రజలకు ఇప్పుడున్న స్థాయిని బట్టి సంస్కరింపబడిన ఆదర్శ సారస్వతాన్ని, కళలను తొందరగా గ్రహించలేరు, జీర్ణించుకోలేరు. ఇవి యెక్కువగా మెరుగులు పెట్టబడినవిగా వుంటాయి.

ఎక్కువ సంఖ్యలో తయారు చేయబడతాయి. అందుచేత మన పని ఇప్పుడు సారస్వతానికీ కళలకూ సంస్కారం పేరు చెప్పి నగిషీలు చెక్కడం కాదు. వాటిని ప్రజాసామాన్యంలోకి ఎక్కువగా ప్రచారంలోకి తీసుకొనిపోవడమే మన ప్రథమ కర్తవ్యం. దీనిని తక్కువ అంచనా వేయడం చాలా ప్రమాదం.

ఏమైనప్పటికీ ఒక సంగతి మాత్రం మనం మరచి పోకూడదు. వ్యాప్తిలోకి తీసుకురావడం అనేది సంస్కరించడమనేది ఒకదానికొకటి సంబంధంలేని సమస్యలు కావు. మన సారస్వతాన్ని, కళలను ప్రజలలో వ్యాప్తిచేసే వారు వాటిలో ప్రజలకు దారి చూపుతూ ఒక అడుగు ముందుండాలి. లేకుంటే మన ప్రచారానికి అర్థం వుండదు.

* * *

నేటి ప్రపంచంలో విజ్ఞానమంతా ఏదో ఒక వర్గానికి, ఏదో ఒక పార్టీకి, ఏదో ఒక రాజకీయ పంథాకు చెందివుంది కళ కళకోసమే అనిగాని, కళలు సారస్వతం వర్గాలకూ, రాజకీయాలకు, పార్టీలకు అతీతమైన స్వతంత్రవిషయాలనిగాని చెప్పుకునే రోజులు గతించాయి. వర్గవిభేదాలతోను, విభిన్న రాజకీయ పాలసీలతోను నిండివున్న నేటి ప్రపంచంలో ఈ సారస్వతం, కళలు అనేవి ఏదో ఒక వర్గానికి, పార్టీకి చెందినవిగాను, వారి రాజకీయహక్కులను కోరికలను ప్రతిబింబించేవిగాను, ఒక విప్లవ వాతావరణంలో విప్లవ కార్యక్రమాన్ని ప్రబోధించేవిగాను వుండవచ్చు. వీటితో దేనితోనూ సంబంధం లేకుండావుంటే అవి ప్రజలతోనే సంబంధం లేనివిగా వుండిపోతాయి.

అంతేకాదు. కళలూ సారస్వతమూ, రాజకీయాలకు లోబడి వుంటాయని మనం అన్నప్పుడు మన వుద్దేశం కార్మికవర్గం యొక్క ప్రజాసామాన్యముయొక్క రాజకీయాలు. అంతేకాని రాజకీయ పార్టీలని పేర్లు పెట్టుకునే విప్లవవ్యతిరేక వాదుల మతాలు కాదు. ఇక్కడ మనం చూడవలసినది రెండు పరస్పర విరుద్ధవర్గాలమధ్య జరిగే సంఘర్షణనుగాని, కొద్దిమందివ్యక్తుల ప్రవర్తన కాదు. భావాలమధ్య పోరాటం, సారస్వతపోరాటం — ముఖ్యంగా విప్లవ భావాలు, సారస్వతం కళలు జరిపే పోరాటం — రాజకీయాల పోరాటానికి లోబడే వుండాలి. ఎందుకంటే, రాజకీయాల ద్వారానే కార్మికవర్గంయొక్క, ప్రజాసామాన్యంయొక్క అవసరాలు ఒక స్పష్టమైన స్వరూపంలో ప్రదర్శింపబడతాయి.

రచయితల కళాకారుల జాతీయైక్య సంఘటన నిర్మించడం ఎలాగ? కళలు, సారస్వతం రాజకీయాలకు లోబడి వుంటాయి కనుకనూ, నేడు చైనా రాజకీయాలలో ప్రధాన సమస్య జపాను వ్యతిరేక పోరాటం కనుకనూ, మనరచయితలూ, కళాకారులూ ఇతర రచయితలతోనూ, కళాకారులతోనూ, ఆ ప్రాతిపదిక మీదనే ఐక్యసంఘటనను నిర్మించాలి. ఈ ఐక్యసంఘటనకూడా ప్రజాస్వామ్య సూత్రాలపైనే ఏర్పడాలి. ప్రజాస్వామ్యసూత్రాలు గిట్టని ఇతర రచయితలూ, కళాకారులూ కొందరు ఈ ఐక్యసంఘటనలోకి రాకపోతే రాకపోవచ్చు. శైలిలాంటి ప్రత్యేక

సమస్యలపైకూడ మనం ఇతర రచయితలతో కలవవలసివుంటుంది. రచనలలోను కళలలోను కార్మికవర్గవాస్తవికత వుండాలని మనంఅంటాం. దీనినికూడా కొంత మంది అంగీకరించకపోవచ్చు. వీటివల్ల ఈ రంగంలో మనం నిర్మించే జాతీయైక్య సంఘటన ఆరంభంలో కొంతవరకు సంకుచితమైనదిగా వుండవచ్చు.

ఈ వైజ్ఞానిక రంగంలో ఐక్యసంఘటనలోనికివచ్చే వివిధ శక్తులలో పెటీ బూర్జువా రచయితలూ, కళాకారులూ ఒక ప్రముఖ స్థానాన్ని ఆక్రమిస్తారు. వారి ఆలోచనలూ రచనలూ కొన్ని లోపాలతోనూ బలహీనతలతోను కూడుకొని వుంటాయి. అయినప్పటికీ, బూర్జువా వర్గంతోను ఫ్యూడల్ వర్గంతోను పోల్చిచూస్తే వీరు మెరుగే. వీరు ఎక్కువగా విప్లవంవైపే మొగ్గుతారు. కార్మికకర్షకులకు, సైనికులకూ దగ్గరగా వుంటారు. వీరి బలహీనతలను పోగొట్టి లోపాలను సరిదిద్ది, వారు పూర్తిగా కార్మిక కర్షకుల, సైనికుల పక్షానికి వచ్చేటట్లు చేయడం చాల ప్రధానమైన కర్తవ్యం.

కళలను, సారస్వతాన్ని విమర్శించడంలో రెండు ప్రమాణాలున్నాయి. ఒకటి రాజకీయదృష్టితోచేసేది. రెండోది కళాదృష్టితో చేసేది.

రాజకీయ కొలబద్దతో చేసే విమర్శన ప్రకారం, జపాను వ్యతిరేక యుద్ధానికి లాభకరమైనదీ, ప్రజాఐక్యతను పెంపొందించి వారంతా ఒకే ఆశయంతో ఒకే హృదయంతో పోరాటోన్ముఖులు అయ్యేటట్లు ప్రోత్సాహపరిచేదీ, వారి అజ్ఞానాన్ని పోగొట్టి విజ్ఞానాన్ని పెంపొందింప జేసేదీ, ఏదైనా మంచిదేఅవుతుంది. అలాకాకుండా జపాను వ్యతిరేక యుద్ధానికి తోడ్పడనిదీ, ఐక్యతను పెంపొందించనిదీ, ప్రజలను నిరుత్సాహ పరిచేదీ, వారి అభివృద్ధిని వెనక్కిలాగిపట్టేదీ ఏదైనా చెడ్డదే అవుతుంది.

మంచిచెడ్డ అనేది దేనినిబట్టి నిర్ణయిస్తాం? రాసేవారి ఉద్దేశాన్నిబట్టా? లేక ఆ రచన కలిగించే ఫలితాన్నిబట్టా? భావ వాదులు(ఐడియలిస్టులు) ఉద్దేశాలకే ఎక్కువ ప్రాధాన్యత నిస్తారు. ఫలితాలను వదలిపెట్టేస్తారు. అలాగే మెకానికల్ భౌతికవాదులు ఫలితాలకు మట్టుకే ప్రాధాన్యతనిచ్చి ఉద్దేశాల జోలికిపోరు... మనం యీ రెండింటినీ వ్యతిరేకిస్తాం. మనం - గతితార్కిక భౌతిక వాదులం (డైలెక్టికల్ మెటీరియలిస్టులం) ఉద్దేశాన్ని ఫలితాన్ని సమన్వయించి చూడాలంటాం. ప్రజలకోసం పనిచేయాలనే ఉద్దేశంతో బయలుదేరితే దానిఫలితం వేరుగావుండదు. ఒకవ్యక్తి లాభంగాని ఒకచిన్న ముఠా ప్రయోజనంగాని సమకూర్చాలనే ఉద్దేశం మంచిదికాదు. అలాగే ప్రజలకోసం పని చేయాలనే ఉద్దేశంతో ఆరంభించినా, ప్రజలు జీర్ణంచేసుకోలేని ఫలితాల నిస్తాందేమోననే విచక్షణ లేకపోతే, అదీ మంచిది కాదు.

మన విమర్శన సెక్టేరియనిజంతో కూడినదిగా వుండకూడదు. జపాను వ్యతిరేక పోరాటంలో మనతో కలిసివచ్చేవారు, జాతీయైక్యసంఘటనలో వున్నవారు తమ తమ రాజకీయ దృక్పథాలతో వెలిబుచ్చే అభిప్రాయాలను సహించాలి. కాని మన

విమర్శలో కొన్ని ప్రధానసూత్రాలను పట్టుకు పాటించవలసిందే; అంటే జాతీయ వ్యతిరేకభావాలతో గాని, అశాస్త్రీయమైనవి, ప్రజావ్యతిరేకమైనవి గాని, కమ్యూనిస్టు వ్యతిరేక భావాలతో గాని వచ్చే రచనలను మనం తీవ్రంగా విమర్శించవలసిందే. ఎందుచేతనంటే ఆ రచనల ఉద్దేశం, ఫలితాలు కూడా జాతీయైక్యతను విచ్ఛిన్నం చేసేవి, జపాను వ్యతిరేకపోరాటాన్ని బలహీనపర్చేవి అయివుంటాయి.

ఇక, కళాదృష్టితో చేసే విమర్శనలకు కొలబద్ద యేమిటో చూద్దాం. ఉత్తమ కళాసమన్వితమైనవన్నీ మంచివే అవుతాయి. కళావిహీనమైనవన్నీ చెడ్డవి అవుతాయి. కాని ఇవికూడా సమాజం మీద కలిగించే ఫలితాన్ని బట్టే వుంటాయి. చాలా కొద్దిమంది రచయితలు, కళాకారులు మాత్రమే తాము తయారుచేసినవి బాగాలేవు అనే విషయం గుర్తించగలరు. విమర్శనవిషయం తీసుకొంటే వివిధ రచనలలోను, కళారూపాలలోను పోటీలు రావడం మంచిది. కాని పోటీలకు వచ్చిన వాటిని విమర్శించడంలో మాత్రం సరిగా విమర్శించాలి. శాస్త్రీయమైన కళాదృష్టితోను, కొలబద్దతోను విమర్శించాలి. కొంచెం తగ్గుస్థాయిలో వున్నవాటిని అభివృద్ధి చేయడానికి ఈ పద్ధతి అవసరం

బూర్జువావర్గం కార్మికవర్గ సాహిత్యాన్ని, కళారూపాలను అవి ఎంత ఎక్కువ కళాసౌష్టవంగా వున్నసరే, నిరాకరిస్తుంది. అలాగే కార్మికవర్గంకూడా బూర్జువా వైజ్ఞానికరూపాలు ఎంత కళాసమన్వితమైనవైనా సరే, నిరాకరించాలి. ఫాసిస్టులకంటె వచ్చి అభివృద్ధి నిరోధకుల వైజ్ఞానికరూపాలు కూడా కొంతవరకు కళా సమన్వితంగానే వుంటాయనే సంగతి మనం మరిచిపోగూడదు. అవి ఎంత ఎక్కువ కళాసౌష్టవంగా వుంటాయో ప్రజాసామాన్యానికి అంత ఎక్కువగా హానిచేస్తాయి. అందుచేత వాటిని నిస్సంకోచంగా నిరాకరించాలి దోపిడి వర్గాలు తమ అవసానదశలో తయారుచేసే సారస్వతంలోను, కళారూపాలలోను, ఒక లక్షణం మాత్రం అన్నిటా మనకి కనబడుతుంది. అది ఏమంటే, ఆ కళారూపాలకి వాటిలో జొప్పింపబడే ఆ వర్గ అభివృద్ధి నిరోధక రాజకీయాలకీ మధ్య వుండే వైరుధ్యం. నిజానికి కారెండూ అతకవు.

మనం రాజకీయాలు కళతో కలిసి వుండాలనీ, కళారూపంతో విషయం కలిసివుండాలనీ అలాగే విప్లవరాజకీయాలను ఎంత ఉత్తమస్థాయికి చెందిన కళారూపంలో పొందుపర్చగలిగితే అంత చక్కగానూ ప్రదర్శింపబడాలని కోరుతాం. లేకుంటే అవి యెంత అభ్యుదయకరమైనవైనా నిర్జీవంగానే వుండిపోతాయి.

అందుచేత మనం కళాసౌష్టవంగా వున్నా అభివృద్ధినిరోధక రాజకీయాలతో గూడిన కళారూపాలనూ తిరస్కరిస్తాం; చక్కని విషయంతో కూడివున్నా కళాసౌష్టవంగా లేక వట్టి నినాదాల బోర్డులు (ప్లే కార్డ్స్)లాగ వుంటే వాటినీ తిరస్కరిస్తాం. వైజ్ఞానిక రంగంలో ఈ రెండు శ్రేణులతోనూ మనం పోరాటం జరపాలి.

నిజానికి నేను మన కామ్రేడ్స్‌లో ఈ రెండు ధోరణులూ వున్నాయి. చాలమంది

ఈ విషయంలో ప్రాథమిక జ్ఞానమే లేకుండా వున్నారు. మీకు కొన్ని ఉదాహరణలు చూపుతాను.

"మానవ స్వభావం" అనేసిద్ధాంతం ఒకటి. అయితే మానవస్వభావం అనేది లేదా? అంటారు. వుంది. కాని అది ఒక నిర్దిష్టమైన స్వరూపం కలిగివుంది. వర్గాలతో కూడిన సమాజంలో మానవస్వభావం అనేది ఆయా వర్గాల స్వభావం మాత్రమే. అంతేగాని వర్గ విభేదాలకు అతీతమైన ప్రత్యేక మానవస్వభావం అనేది లేదు.

మనం కార్మికవర్గపు మానవ స్వభావాన్ని మనదిగా చెబుతాం. అలాగే బూర్జువా వర్గం, పెటీ బూర్జువా వర్గం, వారి వారి వర్గాల మానవ స్వభావ పక్షం వహిస్తారు. అయినా వారు ఆ విషయం మనలాగ దాపరికం లేకుండా చెప్పరు. తమది సాధారణ మానవస్వభావంమాత్రమే నని చెప్పుకుంటారు. అందుచేత వారి దృష్టిలో కార్మికవర్గపు మానవ స్వభావం మామూలు మానవస్వభావానికి విరుద్ధమని. యెనాన్ లోకూడా ఈ "ప్రత్యేక మానవ స్వభావ" సిద్ధాంతవాదు లున్నారు. వారు తమ సారస్వతానికి, కళలకు ప్రాతిపదిక మానవ స్వభావమే అని చెప్పుకుంటూ వుంటారు. ఈ సిద్ధాంతం పూర్తిగా తప్పు.

ఈ సమావేశంలోనే ఒకరు ఇలా అన్నారు: "సారస్వతానికీ కళలకూ ప్రధానమైనది ప్రేమ. మానవజాతిని ప్రేమించడం" అని.

మానవజాతి వర్గాలుగా యెప్పుడైతే విడిపోయిందో, అప్పుడే సర్వమానవప్రేమ అనేది పోయింది. నేడు అధికారంలోవున్న వర్గాలు ఈ నినాదాన్ని తీసుకుంటున్నాయి. కాన్ ఫ్యూషియస్, టాల్ స్టాయి ఈ సిద్ధాంతం కోసమే కృషిచేశారు. కాని ఎవ్వరూ సాధించలేకపోయారు. ఎందుకంటే ఈ వర్గసమాజంలో నేడది సాధ్యమయేది కాదు. అయితే నిజమైన సర్వ మానవప్రేమ అనేది సాధ్యం కానేకాదా అని అడగవచ్చు. అది సాధ్యమౌతుంది. నేడు కాదు. ప్రపంచమంతటా వర్గవిభేదాలు నిర్మూలించబడిన నాడే అది సాధ్యపడుతుంది. ఈ వర్గాలే సమాజాన్ని చీల్చాయి. ఇవిపోతే మానవజాతి తిరిగి ఐక్యమౌతుంది. అప్పుడు సర్వమానవప్రేమ వుంటుంది. అంతవరకూ ఉండదు. మనం ఫాసిస్టులను, మన శత్రువులను ప్రేమించం. సమాజంలో ఒక దుష్టవిధానాన్ని కూడా ప్రేమించం. అలాంటివాటి నన్నిటినీ నిర్మూలించడమే మన ఆశయం. ఇది ప్రజలకుండే మామూలు ప్రపంచజ్ఞానం. మనరచయితలు, కళాకారులూ దీనిని అర్థం చేసుకుంటారా?

ఈ సమావేశంలోనే ఇంకొకరు ఇలా అన్నారు: "సారస్వతం, కళలూ మంచినీ, చెడునూ సరిసమానంగా ప్రతిబింబిస్తాయి."

ఈ రిమార్కులో చాలా అస్పష్టమైన సమస్యలు ఇమిడివున్నాయి. మన సారస్వతమూ, కళలూ ఎప్పుడూ ఆవిధంగానే లేవు. చాలమంది పెటీబూర్జువా రచయితలకు మంచి కనబడటమేలేదు. వారి రచనలన్నీ చెడుగునే వర్ణిస్తుంటాయి. ఇంకా కొంతమంది రచయితలు కేవలం నిరాశావాదాన్ని, తప్పించుకు తిరిగే ధోరణిని ప్రచారం చేస్తారు.

సోషలిస్టు పునర్నిర్మాణ కాలంలో సోవియట్ సారస్వతం ప్రధానంగా మంచినే వర్ణించేది. పొరపాట్లను చూపినా మంచిలో అవి ఒక భాగంగానే చూపేవారు. అంతేగాని మంచి సగం, చెడుసగం అనేది అక్కడలేదు.

అభివృద్ధి నిరోధక సమయాల్లో బూర్జువా రచయితలు విప్లవ ప్రజాసామాన్యాన్ని దోపిడీలు చేసే మూక అని వర్ణించారు. బూర్జువా వర్గాన్ని పవిత్ర మానవులని పొగడేవారు. ఇక్కడ మంచీచెడూ అనేవి తల్లక్రిందు చేయబడ్డాయి.

వీటన్నిటివల్ల మనకు స్పష్టమయేది ఏమిటి? విప్లవరచయితలూ, కళాకారులూ మాత్రమే, ఎప్పుడు పొగడాలి, ఎప్పుడు తెగడాలి- అనే సమస్యకు సరియైన పరిష్కారాన్ని సాధించగలరు. ప్రజాసామాన్యానికి ప్రమాదం కలిగించే దుష్టశక్తులన్నిటినీ ఖండించాలి. ప్రజల విప్లవ పోరాటానికి సంబంధించిన వాటి నన్నిటినీ పొగడాలి. ఇదే విప్లవ రచయితల, కళాకారుల కర్తవ్యం.

"ప్రజా విజయాలను, వారి గుణగణాలను మనం పొగడనవసరములేదు. మంచినే పొగుడుతూవుండే రచనలు తప్పనిసరిగా మంచి రచనలు అవుతాయని ఎక్కడా లేదు. అలాగే చెడుగును బట్టబయలుచేసే రచనలు తప్పనిసరిగా చెడ్డ రచనలనీ లేదు" అనేది ఇంకొక వాదన.

బూర్జువావర్గంలోని మంచిని పొగుడుతూ వుండే రచనలన్నీ తప్పనిసరిగా ఉత్తమరచనలు కావు. అలాగే బూర్జువా వర్గంలోని చెడుగును బట్టబయలుచేసే రచనలన్నీ తప్పనిసరిగా తక్కువరకం రచనలు కానక్కరలేదు. కార్మికవర్గపు మంచిని వర్ణించే పద్ధతి ఆ రచనయొక్క ఉత్తమ గుణాన్ని ఏమీ తగ్గించదు. అలాగే చెడుగుమీద దాడిసల్పే రచనావిధానం కూడా దానిని కొంచెపర్చదు. ఇక్కడ రచయితలను నేనొక ప్రశ్న వేస్తాను. ప్రపంచాన్నీ, ప్రపంచ చరిత్రనూ నిర్మించే ప్రజాసామాన్యాన్ని మనం ఎందుకు పొగడకూడదు? నూతన ప్రజాస్వామ్యాన్ని, సోషలిజాన్ని, వాటి స్థాపనకోసం పోరాడే కార్మికవర్గాన్ని, కమ్యూనిస్టుపార్టీని మనం ఎందుకు అభినందించకూడదు?

ఒకరకం రచయిత లున్నారు. వారికి ప్రజాసామాన్యంకోసం పనిచేయడమంటే ఉత్సాహం వుండదు. ప్రజాపోరాటాలను ప్రజావిజయాలను గురించి మాట్లాడకుండా నిమ్మకు నీరెత్తినట్లు కూర్చుంటారు. ఇంక వారు చేసేపని అంతా తమ్మునితాము పొగడుకోవడం, తమనుతాము అభినందించుకోవడం మాత్రమే. అటువంటివారు పెటీ బూర్జువావర్గానికి చెందిన అహంభావ పూరితులు. వారికి అంతిమ ప్రజా విజయంలో విశ్వాసంలేదు. వారు విప్లవోద్యమానికి వేరుపురుగులు. విప్లవోద్యమానికి వీరు అవసరంలేదు.

"ఇప్పుడు మనల నెదుర్కొనేది మనస్థానం ఎక్కడ అనే సమస్యకాదు. మనకు సరియైన దృక్పథమే వుంది. మన ఆశయం, ఉద్దేశంకూడా సరియైనవే. పోతే మనం విషయాన్ని చెప్పేరీతి మాత్రమే ప్రధానమైంది. ఎందుకంటే చెప్పే విధా

యాన్ని సరిగా చెప్పలేకపోతే సత్ఫలితం కలగదు" అనేది ఒకవాదన.

ఏదైనా ఒకరచన ఎలాంటి ఫలితాన్ని కలుగచేస్తుందో ఆలోచించకుండా రాసిన వారి ఉద్దేశాన్ని పట్టుకే తీసుకుంటే 'రోగం ఏమిటో తెలుసుకోకుండా మందునిచ్చే డాక్టరు' లాంటి వాళ్ళమే అవుతాం. రచయితల, కళాకారుల విషయంకూడా అంతే. ఏదయినా ఒక ఉద్దేశం సంచిదవాలంటే ఆచరణలో పూర్వపు అనుభవంతో పోల్చి దానిఫలితం ఎలావుంది అనేది తెలిసికోవాలి. ఉద్దేశించిన విషయం సరీతగా చెప్పబడింది అనేది పరిశీలించాలి.

మంచి ఉద్దేశం కలవాళ్ళ లక్షణాలు తెలుస్తూనే వుంటాయి. వారు ఆత్మవిమర్శ చేసుకుంటారు. తమ రచనలలోని లోటుపాట్లను గుర్తించి వాటిని సరిదిద్దుకోవాలనే నిశ్చయంతో వుంటారు. నిజానికి ఇలా చేసుకుంటున్ననాడే వారు చేసేది సరైనదిగా వుంటుంది. దానితోపాటు, ఆచరణలో మన రచనా ఫలితాలు ఎలా వుంటున్నాయి అనే సంగతిని ఒక బాధ్యతాయుతమైన దృక్పథంతో పరిశీలించి తెలుసుకుంటూ వుండాలి.

"మార్క్సిజం - లెనినిజాన్ని నేర్చుకోవడంవల్ల గతితార్కిక భౌతికవాద పద్ధతినే రానే అలవాటుకు దారితీస్తుంది. ఇది రచయితలలో ఉద్భవించే నూతన భావాలకు హానికరం" అనే మరోవాదన కూడా వచ్చింది.

మార్క్సిజం - లెనినిజం నేర్చుకోడమంటే - ప్రపంచాన్ని, సమాజాన్ని సారస్వతాన్ని కళలనూ, గతితార్కిక భౌతికవాద దృష్ట్యా చూడడమే.

దానిఅర్థం, భౌతికవాద వేదాంతోపన్యాసాలను యథాతథంగా నీ రచనల్లో పెట్టాలని కాదు.

మార్క్సిజం - లెనినిజం సారస్వతంలోను కళలలోను వాస్తవికతను ఇముడ్చుతుంది. అంతేగాని మార్క్సిజానికి బదులుగా అవి ఉపయోగపడవు. ఉదాహరణకు మార్క్సిజం - లెనినిజంలో పోరాటం సిద్ధాంతంకూడా ఇమిడివుంది. అంతేగాని పోరాటం సిద్ధాంతాన్ని మార్క్సిజానికి బదులుగా తెచ్చిపెడితే ఉపయోగపడదు. సరుకులేని కట్టిపిడివాదం, నూతన భావోదయాన్ని నాశనంచేసే మాట నిజమే. అది ఒక నూతన భావాలనే కాదు, మార్క్సిజాన్ని కూడా దెబ్బకొడుతుంది.

అయితే, మార్క్సిజం - లెనినిజం నూతన భావోద్రేకాన్ని పాడుచేయదా? అని అడగవచ్చు. ఔను, పాడుచేస్తుంది. ఫ్యూడలిజంలోను, బూర్జువావర్గంలోను, పెటీ బూర్జువావర్గంలోను, అహంభావంలోను, అరాజక వాదంలోను, కళకళకోసమే అనే వారిలోను, నిరాశావాదులలోను మొలకలెత్తే ప్రమాదకరమైన నూతన భావాలను నాశనం చేస్తుంది. అలాంటి అభివృద్ధి నిరోధక భావాలు కొత్తవైనా పాతవైనా నాశనం చేయబడవలసినవి కాదా? నా ఉద్దేశంలో అవి నాశనం కావాలి, పూర్తిగా నాశనం కావాలి. వాటి స్థానే విప్లవాత్మకమైన కార్మికవర్గ నూతనభావాలు మొలకలెత్తాలి. అవి వస్తాయికూడా.

నే నింతవరకు చెప్పిన సమస్యలన్నీ రయొనాన్‌లోని మన వైజ్ఞానిక దశాలలో వున్నవే. ఇది దేనిని తెల్పుతోంది? ఇది మూడు పెద్దలోపాలను తెల్పుతోంది. అవి వ్యక్తివాదం (సబ్జక్టివిజం) సెక్టేరియ నిజం, చిలక పలుకుల్లాగ పార్టీ సమాసాల లోనే ప్రతివిషయాన్ని చెప్పడం.

భావవాదం భ్రమలు, పిడివాదాలు చేయడం, చెత్తవాగుడు, సెక్టేరియనిజం ఆచరణలో అశ్రద్ధ మొదలైన జబ్బులు మన కామ్రేడ్స్‌లోకూడ చాలమందికి వున్నాయి. మన పద్ధతులను సరిదిద్దుకోడా నికి తీవ్రకృషి అవసరం.

పెటీ బూర్జువావర్గంనుంచి వచ్చినవారు, సారస్వతం ద్వారాను, కళల ద్వారాను, ఇంకా అనేక ఇతర విధాలా తమ భావా లను ప్రచారం చేస్తూ, కమ్యూనిస్టు పార్టీ కూడా వారి సూచనల ప్రకారం పునర్ని ర్మాణంచేసుకోవాలని కోరుతూవుంటారు. వారికి మనం గట్టిగా చెప్పే సమాధానం ఇది:

"కామ్రేడ్స్! మీ రవలంబించే పద్ధతి మంచిది కాదు. కార్మికవర్గమూ, ప్రజా సామాన్యమూ మీరు కోరినట్లుగా మీ భావాలకు అనుగుణ్యంగా మారరు. మీరు కోరినట్లు జరగడమంటే బూర్జువా వర్గ వాంఛ యీడేరినట్లే. మీసూచనలు పాటిం చడమంటే మా పార్టీని రద్దుజేసుకోవడమే అవుతుంది. పార్టీనేకాదు; దేశాన్నే నాశనం చేయడమవుతుంది. చివరకు మీ తల కాయలుకూడ చెడటమే అవుతుంది. ఐతే ప్రజలు ఎవరి దృక్పథం ప్రకారం సరిదిద్ద బడాలి? కార్మికవర్గ దృక్పథం ప్రకారము: దాని ప్రథమ శ్రేణియైన కమ్యూనిస్టుపార్టీ దృక్పథం ప్రకారమే ఆ పని జరగాలి.

కామ్రేడ్స్! మనలను మనం సరిదిద్దు కోడంలో ఈ ప్రధాన విషయాన్ని తప్పక గుర్తించాలి. మనం ఈ కొత్తప్రజాయుగం లోకి ప్రవేశించవలసివుంది. కనుక వ్యక్తికి, ప్రజాసామాన్యానికి వుండవలసిన సంబంధం ఎటువంటిది? అనే సమస్యను సాకల్యంగా చర్చించి పరిష్కరించాలి. లూ సాన్ గేయం నుంచి ఒక చరణం మన కిక్కడ బాగా ఉపకరిస్తుంది.

"వేలెట్టి చూపుదురుగాక
వేయిమంది నీకేసి.
వెరువకుము వెరపెందుకోయి
వారవ విడువక నీవు
కృషిచేయుము భవిష్యజ్జాతికొరకు"

అదే మన నినాదంగా వుండాలి. మన శత్రువులు వెయ్యిమంది వున్నా సరే, వారెంత భయంకరమైన వారయినాసరే మనం వారికి వెరువం. వారు మనలను లొంగదీయలేరు. భవిష్యజ్జాతి అంటే ఇక్కడ కార్మికవర్గం. ప్రజాసామాన్యం మనం వారికోసం పనిచేస్తాం. ప్రతి పార్టీ సభ్యుడూ, విప్లవరచయితా, కళాకారుడూ, విరామం లేకుండా ఆమరణాంతం నడుము వంచి అందుకోసం పనిచేయాలి. మేధావు లైనవారు తమ జీవితాలను యీ కొత్త ప్రజాజీవితంలో సమ్మిళిత మొనర్చుకో డానికి ఎంతో కష్టనష్టాలకు గురికా వలసి వుంటుంది. ఎంతో శ్రమపడవలసి వుం టుంది. వారిలో వారు ఎంతో ఆత్మ

సంఘర్షణ జరుపవలసి వుంటుంది. కాని దల, మనోనిశ్చయం వుంటే తప్పక జయం మన ఆశయాన్ని సాధించాలి అనే పట్టు పొంది తీరుతాం.

[మా-సి-యంగ్ నూతన ప్రజాస్వామ్య చైనాను నడిపే ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు. సారస్వత సమస్యలను మార్క్సిస్టు దృక్పథంతో పరిశీలిస్తూ ఈయన కొన్ని అమూల్యమైన వ్యాసాలు వ్రాశారు.

చైనాప్రజలు జపాన్ ఫాసిస్టులతో జీవన్మరణ పోరాటం సాగిస్తున్న రోజుల్లో, ఒక సాహితీపరుల సమావేశంలో ఈయన ఉపన్యసించాడు. అందు లోని ముఖ్యభాగాలనే పై వ్యాసంలో పొందుపరిచాము.]

---

# పాఠకులకు వినతి

'అభ్యుదయ'లో ఉత్తమ సాహిత్యం వెలువరించటానికి, అభ్యుదయ రచయితల దృక్పథాన్ని వివరించటానికి మేము చేస్తున్న కృషిలో పాఠకులు కూడా సహకరించాలని కోరుతున్నాము. 'అభ్యుదయ'లో ప్రతి నెల ప్రకటించబడిన రచలన్నిటినిగురించి పాఠకులు తమ అభిప్రాయాలు లేఖల రూపంలో పంపితే ప్రచురిస్తాము. అభ్యుదయ రచయితల దృక్పథాన్ని స్పష్టపరచటానికి ఈ విధంగా ప్రతిరచనను గురించి చర్చించటం అవసరమని భావిస్తున్నాము. అభిప్రాయాల శీర్షికను ఇక నుంచి పాఠకులు విరివిగా వినియోగించుకోవలెనని కోరుతున్నాము.

—సంపాదకులు.

# ప్రగతి

**శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి**

జయ మాయె విజయమాయె నను
గళమ్మెత్తి కాహళి,
అయుతాయుత దేశదేశ
నరమందిర గేహాళి!

అధికార మధమకాలము
అతిహేయ మర్థమత్తత
పృథివీ తలి మాయ మాయె
రణ హింసోన్మత్తత! ...జయమాయె!

గదులై విడి, అరలై చెడి
కలకాలపు లోగిలి
కదియించె ప్రతీచి ప్రాచి
కలిపి యొక్క కౌగిలి! ...జయమాయె!

నిరుపేద పురుగు బానిసీడు, తిరుగు
పాడులోకము
పరువెత్తె; ప్రజావళికి ఇంక
నవ మంగళ నాకము! ...జయమాయె!



# క్విట్ కాశ్మీర్!

శ్రీ పి. లక్ష్మీకాంత మోహన్

"అమ్మోయ్!"

"ఆఁ! యెక్కడున్నావురా పొద్దుట్నించీ? అదేమిటట్లా రొప్పుతూ పరుగెత్తుకొచ్చావు?"

"వూరికినే. మరేఁ.....పట్నం వెళ్ళా"

"పట్నం లాక్కొచ్చావా వెంబడి?"

"లేదమ్మా. ఊహు... మరేఁ అక్కడ......పట్నంలో అబ్దుల్లా మామాయి వుపన్యాస మిచ్చాడు."

"హరిసింగ్ రాజును హతమార్చి పొమ్మనిగాదూ?"

"ఊఁ! సాయంత్రం వూరేగింపు. నేంగూడా పాటలు పాడాలి వెళ్తున్నా"

"మరి యెందుకొచ్చినట్లు! యిదుగో కాస్త అన్నం తినిపో. రొట్టె యిదిగో..."

"నాకాకలిగా లేదమ్మా"

"ఛా, వెధవాయి! కడుపట్లా దించుకుపోతేను!"

"అమ్మతోడమ్మా. ఆకలెయ్యటం లేదు."

"సరే! అట్లాఅయితే, యిదుగో యీ పెనం దించేసి నేంగూడా వస్తా; పోతూండు"

"అమ్మా!"

"యేఁరా నాయనా!"

"అమ్మా......నువ్వొక్కదానివి ... పోలీసులు ... లారీలు ... ఓహ్... యేం లేదమ్మా"

"అయితే బాబూ, నేను గాదురా నిన్ను కని, పెంచిందీ!"

"వూరికినే అన్నానమ్మా. యేమనుకోమాక!"

"పోయి రారా పిచ్చి బాబూ. ఇదుగో అబ్బాయి! మోటారుబళ్లూ అవీ వుంటాయి జాగ్రత్త.

ఇదుగో... మెయినురోడ్డుగుండా పో మాకు. ఇటుగుండా వెళ్లు. వొరే...అబ్బాయి......"

ఆమెయింకా యేమేమో చెపుతుండగానే, చూపును దాటిపోయాడు కొడుకు. ఆమె వితంతువు. మీర్జా వొక్కడే కొడుకు; పన్నెండేళ్ల వాడు. పట్నంలోవుంటే 'కలవారికి' చిరాకుగా వుంటుందని దూరాన్నవున్న కూలీవాళ్ల పేటల్లో వుంటున్నారు. మీర్జా వో పండ్ల దుకాణదారువద్ద అమ్మకుర్రాడుగా కుదిరాడు. పండుగ దినాల్లోనూ, ఆదివారంపూటా బజార్లెమ్మట 'యాపిలుపళ్లు, ద్రాక్షపళ్లోయి!' అని కేకలేస్తూ అమ్ముతాడు.

ఆ పేటకు దూరంలోవున్న వో పల్లెలోని భూస్వామియింట్లో ఆమె పనిగత్తె. యీరోజున ఆమెవంట్లో సుస్తీగా వుండి పనిలోకి పోలేదు. ఐనా ఆమెకు భయంగానే వుంది. అయ్యగారు యేమంటారో!

ఆమె త్వరగా చేసేపని ముగించి చేతులో వొక పోగ్లాం పట్టుకొని బయలుదేరింది శ్రీనగర్‌కు.

దేవదారు తోటలు, పూలతోటల వరుసలు, తెల్లవాళ్ల బంగళాలు, వ్యాపారుల భవనాలు గబగబ వెనక్కి జరుగుతున్నాయి ఆమె ముందడుగేస్తూంటే.

అదుగో! ఆరోడ్డు మళుపులో యెవరో వున్నట్టున్నారే! .... యేదో వీధిమీటింగల్లే వుంది..... ఓహో రసూల్ తాతయ్య, జయరాం బాబాయిగూడా వున్నారే! ఈ ముసిలివాళ్లు యెట్లా పసిగడతారో యేమో, ఎక్కడమీటింగు జరిగితే అక్కడల్లా తయారౌతారు. పాపం రసూలుతాతయ్య బీదరైతు. ఇంటినిండా పిల్లలు. యెన్నో బాధలు. జయరాం బాబాయీ అంతే. వీరిద్దరు తమకేదో మంచిరోజు వుందని, కష్టాలు పోతాయని మీటింగుల కొస్తారు. తమబోటి పేదల కష్టాలుపోయే రోజు వస్తుందా? యీ రాజు నాశనమౌతాడా?

"యీ రాజు నాశనమౌతాడు. మనపిల్లల, తల్లుల పచ్చిమాంసం తినే యీ రాజు నాశనమౌతాడు" ఆజానుబాహుడైన వొక యువ

కుడు వుపన్యసించు తున్నాడావిధ మీా టిం గు లో "మన పచ్చి రక్తాన్ని తాగడానికి యీా రాజుకు అధికారం యెవ్వరిచ్చారు? మన మంతా చెమటరూపంగా నెత్తురు గార్చి పండిస్తుంటే, వస్తువుల్ని తయారు చేస్తుంటే యీారాజు మనకష్టాన్ని దోచుకొని దాన్తో కుక్కల్నీ, గుర్రాల్నీ పెంచు తున్నాడు. కుక్కలకంటేమనం— కూలిరైతులం – హీనమయ్యామా యీా రాజుదృష్టిలో? యీారాజు ......"

సభలో గడబిడబయలుదేరింది. తలావొక. రకంగాతిట్టుతూ, వేడి సెగలు కక్కుతున్నారు సభికులు.

"ఈరాజు పందికన్నాహీనం!" యెవరో అరిచారు.

మళ్లీ ఆ యువకుడు ప్రారంభిం చాడు "యిలాంటిరాజ్యం మన కొద్దు. ప్రజలంతా ఎన్నుకొన్న ప్రభుత్వం కావాలి. కనక మన మంతా, ప్రాణాలకు లెక్కచెయ్య కుండా స్వాతంత్ర్య పోరాటం నడ పాలి. హరిసింగ్ ... హంతకుడా! క్విట్ కాశ్మీర్!" ఆ వుపన్యాస కుడు గర్జించాడు.

"క్విట్ కాశ్మీర్!" అక్క డున్న వారందరి హృదయాల్లోనూ ప్రతిధ్వనించిందది.అక్కడకూచున్న మీార్జాతల్లి నాడుల్లో చిమ్మి కొట్టింది వేడిరక్తం. ఆమె వుద్రే కంతో కంపించింది.

జయరాం బాబాయి తో అన్నాడు రసూలు తాతయ్య "హరిసింగేగాదు. ఈయనమంత్రి, మనవూళ్లో దిగిన పోలీసుమూక గూడా పోవాలి. నాశనంగావాలి. బూడిదై పోవాలి......"

"కక్కాయి! రా జు పో తే రాజుతోపాటు అంతా పోతారు. తాచుపాముతలకాయచితకబాడిసే విషమూా కోరలూా వుంటాయా?" జయరాం బాబాయి సమాధాన పరిచాడు.

"హుం" రసూలు తాత మీాసం మెలిపెట్టేడు.

"తాతయ్యా! మా మీార్జా అవుపించాడానీకు?" ఆమె అడి గింది.

"లేదమ్మాయి! ముందొక వూరేగింపు పోయింది. దాన్తో పాటు వెళ్లాడేమో! అయినా మీా వాడికికాలుఆగుతుందాచేస్తుందా?

యెక్కడతిరుగుతున్నాడో ఏమో" రసూల్ తాత చెప్పేడు.

అయినా ఆమెకు సందేహం గానేవుంది. మీటింగు కొచ్చిన పిల్లల్లో వున్నాడేమో! అదుగో మీర్జా! దగ్గరకుపోయింది. మెచ్చే, మీర్జాగాదు. యెవరో అబ్బాయి. అక్కడ లేడు మీర్జా.

ఆమెయింకా ముందుకునడిచి పోసాగింది. త్రోవలో యెక్కడ చూచినా పండుగగా వుంది. రక రకాల, రంగురంగుల దుస్తులు ధరించిన ప్రజల్తో హడావిడిగా వుంది. సంధ్యాకాలపు సూర్యుడు లేగులాబీ కాంతిని విరజిమ్ముతు న్నాడా ప్రజలమీద.తలెత్తిచూస్తే వారికి ఆకాశం నిప్పుమబ్బుల్తో తగులబడి పోతూన్నట్లుంది. ఈప్రజ ల్ని బురదను చెదరగొట్టినట్లుగా చెదరగొట్టేస్తున్నాయి, పరుగెత్తే పోలీసులాకీలు.

లారీలు! యెక్కడికీ పోలీసు గుంపు?అవిదూసుకుపోతుంటేగాలి వానకు చెట్టుమొదలువూగినట్లుగా ఆమె హృదయం వూగసాగింది. మీర్జా!?

చీకటి పడసాగింది. మంచు తలపాగాలు ధరించిన హిమనగ శిఖరాల్నించి జిల్లు మనిపించే చలి గాలి వీవసాగింది సుడులు సుడు లుగా. ఆమె నరాలు గిజగిజమంటు న్నాయి.

ఆమెకు భయంగావుంది. దోవ కనపట్టంలేదు. మీర్జా యెక్క డున్నాడో! యిప్పుడు పెద్ద బజారు గుండా పోతూన్నదామె. సన్నని పొగమంచు చుట్టూ కమ్మివుంది. యీ పొగమంచులో, చీకట్లోనిశ్చ లంగా నిలబడి గుడ్డికాంతిని వదుల్తు న్నాయి యెలక్ట్రిక్ దీపాలు. వాటి స్తంభాలకిందనిలబడి పరకాయించి చూసిందామె. ఊహూ—మీర్ జా అవుపట్టంలేదు.

బంగరు కాశ్మీర్ బీదలబోనూ పంటలు వుండీ పొట్టమాడుటలు ప్రజారాజ్యముగ చేయగకాశ్మీర్ పదండిముందునకే,

...... పదండిముందునకే!

ఆమెదగ్గరగా దూరానికి దూసుకుపోయిందీ పాట. ధన్... యిద్ధన్...ధన్...... ! ఆపాట వెళ్ళినదారిగుండా కాళ్ళులు విన

వస్తున్నాయి. అటు పరుగెత్తిందామె. అక్కడకు చేరింది. అమ్మో జనంమీద ... కుక్కలు ... పూరేగింపుమీద !

మంచుపొగలో మంచుగుండ్ల పొగ కలసి పోయి నల్లనికావురు గమ్మింది. నల్లని తెల్లని ఆకారాలు కిందపడుతున్నాయి; లేస్తున్నాయి. రాళ్ళవర్షం ... కేకలు, తిట్లు !

"క్విట్ కాశ్మీర్!" గంభీరంగానిలబడి మెల్లగా తలలూపుతున్న దేవదారు వృక్షాల మీదిగా పోయి కొండశిఖరాల్ని తన్ని తిరిగొస్తోం దాధ్వని! కోర్కె...!! హక్కు...!!!

యెవరో మూల్గుతున్నారు; పడుస్తున్నారు; అరుస్తున్నారు; చప్పట్లుగొడుతున్నారు, నవ్వుతున్నారు! బాణంలాగా ఆమె పాదాలనించి తలవరకు యేదో శక్తి దూసుకుపోయింది. తన సోదరుల మీద పోలీసులు. ఆమెగూడా రాళ్లురువ్వ సాగింది.

యెవరా కుర్రాడూ! మీర్జా అయివుంటాడు.

"వోరే నాయనా! మీర్జా!"

"............"

"నాయనా మీర్జా!"

"..............."

"మీర్జా!"

"అమ్మా!"

అటుపరుగెత్తిందిఆమె. యిదిగో యిక్కడ పడివున్నాడు మీర్జా. వొళ్లు చల్లగావుంది. యెడమజేబు తూటుపడివుంది. తడివింది. రక్తం! ఆమె రక్తంలోని రక్తం! మీర్జా!

"మీర్జా! నాన్నా! నువ్వెవరికేం అన్యాయంచేసావురా!"

మీర్జా పలకలేదు; యికలేడు. మీర్జా లేతపెదవుల్నీ, బుగ్గల్నీ ముద్దాడిందామె!

"యెవరు ఖుండా నువ్" గురిపెట్టిన తుపాకితో, నలుపక్కలకీ నిక్కిచూస్తూ వచ్చిన వో పోలీసు భౌభౌ మన్నాడు.

ఆమె పలకలేదు.

"యెవితివే లం..." ఆమెపలకబల్చుకోలేదు. ఆపోలీసు మీర్జాను చూడకుండా గట్టిగా కావలించుకొంది.

ధన్ ... ఆమె పడిపోయింది. ఇప్పుడు తల్లీకొడుకులు వొక్కటైపోయారు. వున్నట్టుండి ఆ వీరుల ఏకత్వంనించి వొక శక్తి పుట్టింది.

చూస్తూండగానే అది పెద్దదైంది. ఆ పోలీసుకు భూతంలా కనిపించిం దా శక్తి.

“క్విట్ కాశ్మీర్!” ఆశక్తిబొబ్బ రించింది. యెదట వున్న పోలీసు తునాతునక లయ్యాడు. దూరాన వున్న రాజభవనం పునాదుల్తోసహా వూగుతూంది అటూయిటూ.

“క్విట్ కాశ్మీర్”

“నిజమే నిజమే.

అంతే అంతే' అని హిమ నగశిఖరాలు గంభీరంగా ప్రతిధ్వని స్తున్నాయి!

# శ్రీ గిడుగు వేంకటరామమూర్తిగారి వర్ధంతి

ఆంధ్ర సాహిత్యంలో మన ప్రజలు నిత్యం వ్యవహరించే భాషను ప్రవేశపెట్టి, మన వాఙ్మయానికి కొత్త చైతన్యం రేకెత్తించిన శ్రీ గిడుగు రామమూర్తిగారు చిర స్మరణీయులు. వారు తమ కార్యభారాన్ని మనపై వదలి, అప్పుడే ఎనిమిది సంవత్సరా లయింది. ఆయన ప్రారంభించిన వ్యావహారికోద్యమం నానాటా పెంపొంది, ఈ నాటి ఆంధ్ర సాహిత్యమంతా వ్యావహారికభాషలోనే వస్తున్నది.

కాని, ఈనాటికీ మన విశ్వవిద్యాలయం, ప్రభుత్వం వ్యావహారికభాషను గుర్తిం చనే లేదు. నేటి ఉత్తమ సాహిత్యమంతా వారికి నిషిద్ధమైంది. భావి పౌరులుగా పెంపొందవలసిన విద్యార్థులకు అత్యవసరమైన ఈ సాహిత్యం అందకుండా, అధికారులు, తమ ఆంక్షలతో అడ్డుపడి, వారి అభివృద్ధినీ, మన వాఙ్మయాభివృద్ధినీ అరికడు తున్నారు. ఎన్ని సంస్థలు ఎన్ని తీర్మానాలు చేసినా, ఎన్ని సార్లు హెచ్చరించినా, అధికారులు లక్ష్యపెట్టక, ఇంకా ఆకృతకభాషనే పట్టుకు వ్రేలాడుతున్నారు.

ఈ పరిస్థితుల్లో మనం శ్రీ గిడుగు రామమూర్తిగారి వర్ధంత్యుత్సవాన్ని జనవరి **22**–న జరుపుకొంటున్నాం. ఆయన ఏ వ్యావహారికభాషకోసం నిరంతరం కృషిచేశాడో, ఆ వ్యావహారిక భాషను విశ్వవిద్యాలయాలూ, ప్రభుత్వ విద్యాశాఖా ఆమోదించేటట్లు చెయ్యవలసిన బాధ్యత మన మీద వుంది.

కనుక, అభ్యుదయ రచయితలూ, తదితర సాహితీపరులూ అందరూ కలిసి, జనవరి **22**–వ తేదీన శ్రీ రామమూర్తిగారి వర్ధంతిని జయప్రదంగా జరిపి, వ్యావహారిక భాషను గూర్చి తీర్మానాలు చేసి ప్రభుత్వానికీ, విశ్వవిద్యాలయాధికారులకూ అంద జేయాలని కోరుతున్నాం.

— కార్యదర్శులు,

ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం.

# విప్లవ పథం

— శ్రీ బి. గోపాలం —

వెలిగిందోయ్ తెలంగాణ !
కదలెన్ ! విప్లవపథాన.

నవభారత భాగ్యోదయ సవనంబున కిరణంబై
నరవేదన, పరపీడన, పరిమార్చగ, జనతేజము— వె ॥
అణగారిన హృదికోరిక కణజాలము ఎగసిందోయ్,
అవినీతుల పదఘట్టన, యమబాధల సమయించగ— వె ॥
చెరసాలలు, పెనుబాధలు, సైన్యాలు, తుపాకి బార్లు
మరణాలకు వెరపేలని, సెగనెత్తుటి జవయుందని— వె ॥
దురహంకార, నిరంకుశ భవనాలకు పొగక్రమ్మెను,
జనశత్రువర్గ పీడన పరిపాలన కెసరెట్టెను— వె ॥
జన రక్తము, శిరమెక్కిన ఘనపింఛల వణికించెను,
నరహంత ధనికపాలన నశియించును, నిజమేనన— వె ॥
నిదురించెడి తరుణంబున నదిగర్భము చెదరగొట్టి,
మెరకేసిన వరిదుబ్బుల, నరికేయుచు వడి వడిగా వె ॥
తనవారితో పెనవేసుక, సుఖశాంతికి ఒక జాలున,
ప్రవహించ విశాలఆంధ్ర జనవాహిని, కళ లేలుచు— వె ॥
అదిగదిగో! తెలంగాణ, విశ్వామిత్రుల యాగము,
తెల్ల నల్ల మారీచుల దాస్య విముక్తికి మార్గము,
లెండు! తెలుగు రక్తమున్న రామలక్ష్మణులు వేగము,
మన వైరుల చునుమాడగ, జనరాజ్యము నెలకొల్పగ,
రండోయ్ - రా రండోయ్!—

జెరమావద్దవున్న స్పానిష్ సైన్యంలో లింకన్ దళంలో చేరాడు. చేరీ చేరడంతోటే, వాళ్ళకొక ఆదర్శవీరుడై వాళ్ళందరూ తన మాటమీద ఆధారపడేటంత స్థితికి వచ్చాడు. ఆస్టూరియాలో 1934లో వచ్చిన విప్లవాన్ని గురించి అతను గొప్పగొప్ప కథలు చెబుతూండేవాడు—

"ఇప్పుడు మనంచేసేది అసలుయుద్ధమే కాదు. వాళ్ళు చూడకుండా, పగల్లా, పాములాగా, పొట్టమీద పాకిపోతూ వుండాలంటే-ఎంత ఇది!—మరి చీకటి పడ్డదా, ఇక మనం వాళ్ళకు అతీతం అన్నమాటే-చుట్టలు కాల్చుకుంటూ ఆ చక్కని స్పానిష్ అధికారులు - మనం ఒక్క చేతిబాంబు విసిరివేసి 'ఆరిబా మాంకోస్' అని అరుస్తాం - ఆ తెల్లటి మొహాలూ వాళ్ళూ, శరీరాలు భయంతో గజగజలాడిపోతూ, ఆ పాముల్లాంటి తొడలు కదిలించుకుంటూ - ఇంకా ప్రాణంతోనే-పారిపోతారు - చమురుకున్న పెద్ద మనుషులు, కుక్కలకొడుకులు! ఛీ- వాళ్ల మొహాన ఉమ్మెయ్యాలి!" అని చెప్పేవాడు.

"ఈ రష్యన్ బయొనెట్లంటే నాకు చాలా యిష్టం. ఇవి పొడుపుగాను బరువుగాను వుంటై; మంచితూకంగా పోతై" అనిఅతని ప్రశంస. డైనమైటు, తుంపుటిగెలూ, గుర్రపునాడా ముక్కలూ, మేకులూ పెట్టి, చేతిబాంబు చెయ్యడం ఎట్లాగో అతను తన సైనికులకు నేర్పాడు.

"ఒరే ఫాసిస్టు! చూడు — నీవు నీ భార్యతో సుఖంగా ఇంటిదగ్గరవుండడం మంచిది; లేదా, ఎల్ ఫాంటాస్టికోకు ఒక పక్కని నిశంతువుగు వదలి పెట్టి పోతావు" అనేవాడు.

ఆస్టూరియన్ జానపదాలు పాడడం అతని కెంతో ఇష్టం. 'కాన్సెర్టినా' చక్కగా వాయించేవాడు. జీవితం అతనికి ప్రియమైనది.

అగ్ని జ్వాలల లాగా, ఆ డాబు దర్పాలూ, ఆ ఉక్కు గుండె - అతను పోరాడే కోడిపుంజులాంటి వాడు. పట్టి పట్టనట్లు సరదాగా పోయే అతని స్వభావం అలావుంచి, అతనికి గాఢమైన వర్గచైతన్యం వుంది. ఫాసిస్టులంటే ఎక్కడలేని ఆవేశం వచ్చి, తీవ్రంగా ద్వేషిస్తాడు.

లింకన్ దళం ఆల్బసెట్ లో విశ్రాంతి తీసుకుంటున్న రోజుల్లో, 'ఫాసిస్టు శ్రేణుల వెనుక పోరాటం సాగించడానికి గెరిల్లాలుగా తగినవారిని ఎన్నుకొని పంపవలసిం' దని ప్రతి దళానికీ ప్రభుత్వంనుంచి పిలుపు వచ్చింది. లింకన్ దళంలోంచి ఎల్ ఫాంటాస్టికో- అతని అసలు పేరు జోన్స్- ఏకగ్రీవంగా ఎన్నుకోబడ్డాడు.

స్టీవ్ అతని కీ సంగతి చెప్పినప్పుడు అతను వెర్రికేక లేస్తాడేమో ననిపించింది. తనకు కలిగిన ఆ గౌరవానికి అతను అంత గాఢంగా కదలి పోయాడు. లాయలిస్టు సైన్యాల్లోంచి, అసలు, గెరిల్లాలను ఏరుకునేటప్పుడు, చాలా కట్టుదిట్టంగా, 'మంచి సమర్థుల్ని, శక్తివంతుల్ని, ఎల్లప్పుడూ కన్ను కలిగివుండే వాళ్ళనీ చూసి మాత్రమే తీసుకుంటారని ప్రతి ఒక్కరికీ తెలుసు. అంత గౌరవం అతనికి పట్ట శక్యంకాలేదు. 'కామ్రేడ్, ఇది నవ్వులాట కాదుగదా? నువ్వు పరాచకం చెయ్యడం లేదు గదా?' అన్నాడు.

"కాదు. ఇది హాస్యం కాదు. ఈ కార్యక్రమం చాలా ప్రమాదకరమైందీ, తీవ్రమైందీ. ఈపనికి నీవు సిద్ధంగా వున్నావా?"

"సిద్ధంగా వున్నా డా లేడా అనినీవు ఎల్ ఫాంటాస్టికో నేనా అడుగుతున్నావు? ఏంచెయ్యవలసివుంది? చెప్పు- ఏంచెయ్యడం అవసరమో?" అని జోన్స్ గుండెమీద చేయివేసుకొని అన్నాడు.

"ఆ విషయంనీకు మాడ్రిడ్ లో చెబుతారు. ఈ అమెరికన్ కామ్రేడునుకూడా ఆపనికే నియమించారు. ఇతను నీతోటే వస్తాడు. నీవు ఒక్క మాటకూడా ఎవ్వరితోనూ నోరు జారకూడదు. పెదవులు అతుక్కుపోయి వుండాలి. జోన్స్, సెలవు."

ఈ అద్భుతంలో మునిగిపోయి, దీన్నే గొప్ప చేసుకుంటూ, జోన్స్ బయలుదేరాడు. అతనితోపాటు అమెరికన్ కామ్రేడ్, 'కామ్రేడ్ యాంక్' కూడా సాగాడు. కామ్రేడ్ యాంక్ స్పానిష్ భాష ధారాళంగా మాట్లాడతాడు. యాంక్, వెనక, తాడుమీద అద్భుతమైన ఫీట్లు చేసేవాడు; శరీరపుష్టి కలవాడు.

... ... ...

ఇలా అనేక దళాలనుంచి ఎన్నుకోబడి వచ్చినవారందరినీ మాడ్రిడ్ లో ఒక 'కమిషన్' పరీక్షించింది. వీరందరిలోనూ ఇరవై ఇద్దరిని మాత్రమే వారు యేరుకున్నారు. ఆ యిరవై ఇద్దరూ వెళ్ళిపోయి ఒక గంటలో రావచ్చునని చెప్పారు. జోన్సను మాత్రమే ఆఫీసువద్ద ఉండమని చెప్పారు. అతను ఏమీ తోచకుండా, ఆ వరండాలో అటూ ఇటూ తిరుగుతూ, సిగరెట్ మీద సిగరెట్ ఊదిపారేస్తూ, ఒకవేళ తనను త్రోసిపుచ్చుతారేమో నన్న భయంతో చెమటలు కారుతూ, వున్నాడు.

చిట్టచివరకు...లోపలికి పిలిచారు. "కామ్రేడ్ జోన్స్, యీ వీరులందరి ప్రాణాలూ నీ కళ్ళల్లో పెట్టుకొని, వీరికి నాయకత్వం వహించి, ప్రజాప్రభుత్వ విశ్వాసం పొందడానికి నీవే యోగ్యుడవనుకొంటున్నాము" అన్నాడు కమిసార్.

"ఆఁ...... ఆఁ...... అలానా..." అతని ఆ ఉత్సాహాన్ని మింగలేక నాలిక

తడబడుతున్నది. "కామ్రేడ్స్! నన్ను గురించి నిజంగా మీరలా ఎందుకనుకుంటారో నాకు తెలీదు — పోనీ — అలాగే కానీండి. ఇప్పుడు ఏం చెయ్యవలసివుంది?"

"మొదట, నీ సైనికులచేత ఈ దరఖాస్తులు పూర్తిచేయించు ఇందులో నీకు కూడా ఒకటి వుంది. తర్వాత, కాస్త్రోబా రాష్ట్రంలో రైతులు వేసుకునే రకం దుస్తులతో నీ సైనికుల్ని సమాయత్తం చెయ్యి. ఆటోమాటిక్ పిస్టల్లూ, చొక్కాల కింద కట్టుకునే వాటి ఒరలూ సంపాదించు. ఆయుధాగారాలనుంచి గానీ, డిపోలనుంచి గానీ నీకు కావలసినవాటిని తెచ్చుకోడానికి ఇక్కడ నీకు అనుమతి వుంది. ఈ రాత్రికి నీకు ఫాసిస్టు ఉపయోగించే నోట్లు కొన్ని ఇస్తాం. పోజ్గో బ్లాంకో దగ్గరవున్న ఒక కేంద్రానికి ఈరాత్రే మీరంతా 'ట్రక్కు'లో వెళ్తారు. ఆ ప్రాంతంలో వున్న సేనా నాయకుడు మీకు వివరంగా ఆజ్ఞలిస్తాడు; గుర్రాలనూ, ఇంకా అవసరమైన ఇతర పరికరాలను సమకూర్చి పెడతాను..... సరే, ఇప్పుడు నీకిచ్చిన ఆజ్ఞ ఏమిటో మళ్ళీ చెప్పగలవా?"

జోన్స్ చెప్పగలడు, చెప్పేసాడు కూడా. గ్రామఫోనులాగ చెప్పబడిన స్వరంలోనే కా వల్లించాడు. మట్టా ప్రశ్న అడిగిన వర్గమొహాల్లో ఆశ్చర్యం కనిపించింది. జోన్స్ వాళ్లకు తెలియజెప్పాడు. "జోన్స్ ఎప్పుడూ ఏదీ వ్రాసిపెట్టుకోడు. ప్రతిదీ అతను హృదయంలోనే దాచుకుంటాడు"ని.

బయట, సైనికులు వచ్చి కూడుకున్నారు. కమిసార్, జోన్సును తీసుకెళ్లి, వాళ్లకు నాయకుడుగా నియమింపబడిన విషయం వెల్లడించాడు. "ఆస్టూరియా పుత్రుడు, సుప్రసిద్ధ స్వాతంత్ర్య వీరుడు, గెరిల్లా యుద్ధంలో ఆరితేరినవాడు అయిన ఇతను మన ఆశయాలనూ, ఆస్టూరియా ప్రజల ఉత్తమ సంప్రదాయాలనూ నిలబెడతాడని మాకు తెలుసు" అన్నాడు కమిసార్.

సైనికులు ఉత్సాహం వెలిబుచ్చారు. జోన్స్, ఆ భయంకరమైన యర్రటి మొహంతో, తోలుచేతుల్లు, కొంచెం అటూ ఇటూ కదిలాడు. కాని రాజకీయితో నవ్వుద్దామనే కోరికను ఎలాగైనా అణచుకొన్నాడు. "కామ్రేడ్స్ మనం చెయ్యవలసిన పని వుంది... మొట్టమొదట, రికార్డులూ యితర వివరాలూ చూడడానికి నాకొక అసిస్టెంటు కావాలి. మీరు ఎవర్ని నియమిస్తారు?" అని అడిగాడు.

కామ్రేడ్ యాంక్ ఎన్నుకోబడ్డాడు.

"ఇదుగో, చికో, ముందు ఈ దరఖాస్తులు పూర్తిచేయించు. ప్రతి ఒక్క కాగితాన్ని జాగ్రత్తగా చూడు. అన్నీ శుచిగా వుండాలి. తర్వాత, త్వరగా ఆయుధాగారానికి రా. నేను అక్కడ కలుసుకుంటాను" అని వెంటనే ఆజ్ఞాపించాడు జోన్స్.

"ఏయ్ జోన్స్, ఆగు. నీది నీవు పూర్తి చెయ్యాలేదు."

జోన్సుకు కోపంవచ్చింది. "నీవు నా సహోద్యోగివి కదా? ఇప్పుడు జోన్సుకు తీరికలేదు. నాకోసం అదికూడా నీవే పూర్తిచెయ్యి. నీతో పాటు నా 'కాన్సెప్టినా'ను ఆయుధాగారానికి తీసుకురా!"

రోడ్డుప్రక్క ఆగివున్న మోటారు

సైకిళ్లను చూస్తూ జోస్ ఒక్క క్షణం ఆగాడు. వెంటనే, నిగనిగ లాడుతున్న ఒక పెద్ద మోటారుసైకిల్ దగ్గిరికి పోయి డ్రైవరును చూసి, "చికో, ఆయుధాగారానికి త్వరగా పోనీ" అన్నాడు.

"క్షమించాలి, కామ్రేడ్, ఇవి ఆఫీసర్లకోసం మాత్రమే."

జోస్ చిరునవ్వు నవ్వి అతని వీపుమీద తట్టాడు. నిదానంగా, హుందాగా, తన అధికార పత్రం తీసి, అతని మొహంఎదుట పెట్టాడు. నెమ్మదిగా మోటారుసైకిలెక్కి, "చికో, నేను ఆఫీసర్ని. నా పేరు ఎల్ ఫాంటాస్టికో. ఆయుధాగారానికి పోనీ" అన్నాడు.

... ... ...

"నీవు వంతెనదగ్గిరికి పోగానే,అక్కడ స్విచ్ పక్క వుండే ఎనిమిదో నెంబరుగది కనిపిస్తుంది. మధ్యాహ్నంనుంచి అర్ధరాత్రి దాకా అక్కడ మన కామ్రేడ్ పని చేస్తాడు. అతనికి పెద్ద, బూడిదరంగు మీసాలుంటై. పొట్టిగా బొద్దుగావుంటాడు. యాభై యేళ్లుంటై.

"'ఇది చాలా అద్భుతమైన రోజు' అని నీవు చెప్పాలి — రెండు సార్లు. తర్వాత అగ్గిపుల్లఅడుగు. అతను 'నిజంగా!' అని రెండు సిగరెట్లు తీసి, నీ కొకటి ఇస్తాడు. కాని తన సిగరెట్టు ముట్టించుకోడు. 'నాదగ్గర చుట్టలున్నై, నీ కొకటి నీ పేరు చెప్పు. అంతటితో అంతా సుగమమవుతుంది.........ఏదీ, నీ కిచ్చిన ఆజ్ఞ ఏమిటో మళ్ళీ చెప్పు"

... ... ...

కావలసిన పరికరాలను సమకూర్చుకుంటూ; గుర్రాలకు తరిఫీదు ఇస్తూ; తమకున్న రెండు చిన్న మర తుపాకులతోను, ఆటోమాటిక్ పిస్టళ్ళతోను గురి పెట్టడం అలవాటు చేసుకుంటూ; ఆస్టూరియా పద్ధతిలో డైనమైట్ బాంబులనుపయోగించడం నేర్చుకుంటూ జోస్ దళం, రెండురోజులు, అక్కడే ఆగిపోయింది. ఈ సన్నాహానికంతటికీ జోసే అధ్యాపకుడూ, నాయకుడూను. అతని వైఖరి చూస్తే అంత ఉత్సుకంగా లేదు. తన మీదనున్న కార్యభారంతో కొంచెం తగ్గి, ఓర్పుతో, కష్టపడుతూ, ప్రతి చిన్న వివరం కనిపెడుతూ, ఏపనైనా సమగ్రంగా పూర్తయిందాకా తృప్తి ఎరుగకుండా ఉన్నాడు. తాము పడగొట్టవలసిన వంతెన మాదిరి వంతెన ఒకటి వారు నిర్మించారు. దాని మీద డైనమైట్లు విసరడం అలవరచుకున్నారు. ప్రతి ఒక్క సైనికుడూ డైనమైట్లు అమర్చడంలోనూ, టైమ్ ఫ్యూజు కోయడంలోనూ, ఇంకా తక్కిన పనుల్లోనూ తరిఫీదు పొందాడు. తర్వాత, ఎవరి పని వారికి ప్రత్యేకించబడి, అందులో ప్రత్యేకం తరిఫీదు ఇవ్వబడింది.

రాత్రిళ్ళు, జోస్, కామ్రేడ్

పల్లెప్రాంతాలను గురించీ, కొండ కనుమలను గురించీ, తాను పడగొట్టవలసిన వంతెనదగ్గరకు పోనూరానూవున్న వివిధ మార్గాలను గురించీ, పూర్తి పరిజ్ఞానాన్ని వివరాలను సేకరించుకొని, అతను ఆ హోటల్ నుంచి వచ్చేసాడు.

మూడోనాడు ఆర్డరు వచ్చింది. ఆ కాగితం బల్లమీదపడేసి, జోస్, కామ్రేడ్ యాంక్ ను కేకేశాడు: "అదుగో – ఆర్డరు–బల్లమీద వుంది. చదువు!"

కామ్రేడ్ యాంక్ చదివి వినిపించాడు.

"నీకు తెలుసుగదా, యీ కాగితం తగులపెట్టాలి. అంతా గుర్తుందా?" అని అడిగాడు జోస్.

"ఉందనుకుంటున్నాను."

"అనుకోడం!...అంత మంచిదికాదు. మళ్ళీ ఒకసారి శీఘ్రంగా చదువు...ఏదీ సర్గాకే సారి..." కామ్రేడ్ యాంక్ సాధ్యమైనంత గట్టిగా చదువుతూంటే, జోస్ తన పొరపాట్లను సరిదిద్దుకున్నాడు. "నీవు రైతుదుస్తులన్నీ పట్టుకురా—ఆర్డరు సంగతి మన 'చికో' లకు చెబుదాం." అన్నాడు.

ఆర్డరు కాగితం తీసుకొని జోస్ బయటికి వెళ్లిపోయాడు. అతను సైనికులను పిలవడం కామ్రేడ్ యాంక్ కు వినిపించింది. "కామ్రేడ్స్, ఇవాళ మనకు ఆర్డర్సు వచ్చాయి. ఇదిగో యిప్పుడే చదివి వినిపిస్తాను. వినండి..."

అయితే, ఆ ఆర్డరు కాగితం యింకా బల్లమీదే పడివుంది. జోస్ మరోకాగితం తీసుకెళ్ళాడు. కామ్రేడ్ యాంక్ ఆర్డరు కాగితం తీసుకొని తలుపుదాకావచ్చి ఎల్ ఫాంటాస్టికోను పిలుద్దామని నోరు విప్పాడు. అక్కడ జోస్ ఆర్డరు చదువుతున్నాడు:

"......ఆ పట్టణానికి పన్నెండు కిలోమీటర్ల పడమటగా వున్న వంతెనదగ్గరకు నడవండి. మీరు పడగొట్టవలసిన రైలు రాత్రి పదకొండు గంటలయ్యే ముందు అక్కడికి వస్తుంది."

అతని చేతిలో వున్న కాగితం వంక కామ్రేడ్ యాంక్ దిగ్భ్రమగా చూసాడు. మాటమాట – ప్రతిమాటా–జోస్ అప్పచెపుతున్నాడు. కాని, జోస్ కళ్లఎదుట గట్టిగా పట్టుకొని చూస్తున్న కాగితం మాత్రం, కామ్రేడ్ యాంక్ తయారు చేస్తున్న నివేదిక.

కామ్రేడ్ యాంక్ నోరు నొక్కుకున్నాడు. అలాగా సంగతి, ఎల్ ఫాంటాస్టికోకు చదువు రాదన్నమాట. కాని, కెమేరాలాంటి జ్ఞాపకశక్తీ, ప్రక్కన సమర్థుడైన సహోద్యోగీ వున్న సేనాధిపతికి అసలు చదువురావలసిన పనేముంది?

... ... ...

లోయక్రిందుగా దూరంగా రైలుకూత వినిపించింది. చిట్టచివరి డైనమైట్ ముక్క కూడా జోస్ అక్కడ కుక్కివేసాడు. "కామ్రేడ్స్...పావెల్స్ తెండి......బొగ్గు కావాలి......చెమ్మ తగల నివ్వకూడదు...ఆఁ...ఇప్పుడు మన్ను పట్టుకురండి...దానిమీద పోసెయ్యండి......ఎంతబరువుంటే అంత బలంగా ప్రేలుతుంది!"

ఉక్కు చక్రాలను గిర గిర త్రిప్పుకుంటూ రైలు వచ్చేస్తున్నది— మాడ్రిడ్

నుంచి సేవిల్లీ వెళ్లే రవాణాబండి. జోస్ ఫ్ల్యాగ్ పుచ్చుకొని ఒక దట్టమైన గుబురు లోకి వెళ్లిపోయాడు. నలభై గజాలు— నలభై సెకండ్లు. అతని చుట్టు నిప్పు కణకణ లాడింది. "హా! తప్పుకో! పెడ్రో!" ఫ్ల్యాగ్ ఒక్కసారి బుసకొట్టింది

అందరూ పరుగెత్తారు.

ప్రేలుడు జరిగినప్పుడు ఇంజనూ, నాలుగు పెట్టెలూ వంతె మీద వున్నాయి. తక్కిన పెట్టెలన్నీ దిగో పడిపోయాయి. ఆ బండిలో 'గాసొలిన్' తెస్తున్న పెట్టె లున్నాయని గాబోలు! ఒక్క క్షణంలో ఆ పర్వతాంగణమంతా, ఒక పెద్ద [illegible] మయిన విద్యుద్దీపం వెలిగించినట్లు ధగ ధగ వెలిగింది. ఇక ఇప్పుడు నేలమీద పడుకొని పాములాగా పొట్టతో ప్రాకిపోవడం కంటె గత్యంతరం లేదు. గుర్రాలను వదిలేసి ఒక దీర్ఘమైన చుట్టు త్రోవన లా[illegible]లిస్తూ ప్రాణాల ద[illegible]కు చేసుకోడం అవసరం. సోమరితనంగా హోటళ్లలో బాతాఖానీ వేస్తున్న రోజుల్లో జోస్ యీ త్రోవ తెలుసుకున్నాడు.

... ... ...

అతని గుర్రాలూ పరికరాలూ అన్నీ పోయాయి. అన్నింటికీ మించి, ఒక సైనికుణ్ణీ ఒక మంచి కామ్రేడ్ ను పోగొట్టుకున్నాడు. ఎల్ ఫాంటాస్టికో తన అజాగ్రత్తను ఎంతో విచారించాడు. ఎంత సేపటికీ అతను శాంతించలేదు. తన సైనికుల శ్రద్ధ వహించడం నాయకుడి బాధ్యత. రైలు వంతెన దగ్గిరికి వచ్చినప్పుడు, తూర్పు వైపున వుండాలని తను పెడ్రోకు చెప్పకుండా నిర్లక్ష్యం చేశాడు. అది తప్పు, నేరం; తాను అంత నిర్లక్ష్యంగా ఎలా వుండగలిగాడు?

అధికారులనుంచి వచ్చిన ప్రశంసలు కూడా అతనికేమీ సంతృప్తి కలిగించలేదు.

"నీవు ప్రజారాజ్యానికి మహత్తరమైన సేవ చేసావు" అన్నాడు కమాండరు.

"కాని మా గుర్రాలు పోయాయి" అన్నాడు జోస్.

"ఇలాంటివాటికి మనం సిద్ధపడాలి."

"కాని, పెడ్రోను పోగొట్టుకున్నాం. నేనుకనుక అతనికి సరైన సూచనలు ఇచ్చివున్నట్లయితే, అతను ఇప్పటికి బ్రతికేవుండేవాడు."

"మనం సమస్యల్ని ఆ రకంగా చూడం. నీ సైనికులకు శిక్షణిచ్చి, నీకు నీవు తరఫీదు పొందడానికి నీవు అన్ని జాగ్రత్తలూ తీసుకుంటావనే మా విశ్వాసం. మేం ప్రతి మనిషికీ పూర్తి విలువ ఇస్తాం. ఒక మంచి కామ్రేడ్ ను పోగొట్టుకున్న నష్టాన్ని తేలికగా చూడం. కాని ధైర్యసాహసాలతోనూ ఉపజ్ఞతోను కూడిన ఒక మహత్తర కార్యాన్ని నీవు సాధించావు. మనకేమీ నష్టాలు కలగవని మనం అనుకోలేము కదా! నీ ఉత్తమ కర్తవ్యాన్ని కొనసాగించు; అనుభవాన్ని వినియోగించుకో!"

ఎల్ ఫాంటాస్టికో దళం సాధించిన మొట్టమొదటి విజయం ఇది. కాని ఇదే చివరది కాదు.

... ... ...

ఇక చెప్పబోయే దాంట్లో కొంత కామ్రేడ్ యూంక్ ద్వారాను, కొంత చాలాకాలం తర్వాత ఒక స్పానిష్ కామ్రేడ్ ద్వారాను తెలిసింది. ఆ

కార్మేడ్‌ను కొంతకాలం, ఒకపనిమీద ఒక ఫాసిస్టు సైనికోద్యోగి దగ్గరనౌకరుగా వుంచారు.

ఈ క్రిందివిధంగా జోన్స్‌కు వచ్చిన ఒక ఆర్డరుతో కథ ప్రారంభ మవుతుంది:

మలాగా పట్టణం ఇటలీ ఫాసిస్టుల చేతిలో పడ్డప్పుడు, అక్కడ కొంతమంది ముఖ్యమైన ప్రజాప్రభుత్వ నాయకులు వాళ్లకు పట్టుబడ్డారు. కాని, మామూలు సైనికుల్లాగా తమ్మునుతాము మరుగు పరచుకొని, వందలకొలది ఖైదీలకు పట్టిన ఉరికొయ్యల దుర్గతినుంచి, వారు తప్పించుకొన్నారు.

ఇప్పుడు వారు కార్డోబాదగ్గిర ఒక జైల్లో వున్నారనీ, ప్రాణ ప్రమాదంలో వున్నారనీ వర్తమానం వచ్చింది.

"ఫాసిస్టు సైనికోద్యోగుల్లాగాను, సైనికుల్లాగాను ఒకదళాన్ని తయారుచెయ్యాలి. ఖైదీలను పట్టుకొచ్చే వాళ్లలాగా మీరు జైలుదగ్గరకు వెళ్లండి. గార్డు స్వాధీనం చేసుకొని, ఖైదీలందరినీ వదిలేయ్యండి. వారికి మన శ్రేణులు చేరుకొనే మార్గం బోధపరచండి. మీకుఇందుతో పంపుతున్న పేర్లూ, ఫొటోలూగల కార్మేడ్ల కోసం గుర్రాలను సిద్ధపరచండి. ఏది ఏమైనాసరే, వారు క్షేమంగావచ్చేట్టుచూడాలి. ఈపనికి అవసరమైన అన్ని ఎత్తుగడలూ, ఏర్పాట్లూ మీరు చెయ్యవలసి వుంది. ఇది ఆజ్ఞ."

జోన్స్, మరి ఆరుగురు సైనికులూ ఫాసిస్టు దుస్తులు వేసుకున్నారు. ఫాసిస్టు శాల్యూటు అలవాటు చేసుకున్నారు. ఫాసిస్టు దర్పం నేర్చుకున్నారు. కొన్ని ఫాసిస్టు హోటలుకూడా కంఠతా పెట్టారు. ఫాసిస్టు స్త్రీ గుర్రపుదళంలాగ తప్పకు పోవడానికి అవసరమైన వర్తమానమంతా సేకరించుకున్నారు.

ఆ బొంతల్లాంటి యూనిఫారంలు, నడుముకు కట్టుకున్న తోటాలను కప్పివేసాయి. వారి తుపాకులు కొయ్యచట్రాల్లో అమర్చబడ్డాయి. ఆ చట్రాలు తుపాకి 'బట్'లకు తగిలించబడి, అవన్నీ చిన్నచిన్న మరతుపాకుల్లాగా తయారైనాయి. కాని నడుముకు తుపాకితోటాలు కట్టుకున్న కాన్వాస్ బెల్టులు చాలా వెచ్చగావున్నాయి. అలాగే చెమటోడుస్తూ వారు కార్డోబా దిక్కుకు గుర్రాల మీద పోతున్నారు.

త్రోవవెంబడి పోయే స్త్రీలను రెప్ప వాల్చకుండా చూస్తూ, వారు అక్కడే వీధిప్రక్కను వున్న హోటలుముందు పచార్లు చేశారు. సాయంత్రం సరికి, జోన్స్ ఒక నిర్ణీతమైన ప్రదేశానికి వెళ్ళి కొన్ని పనులు నెరవేర్చుకొన్నాడు. సాయంత్రం ఆరున్నరకు జైలుకు కొత్త ఖైదీలను తీసుకువస్తారని అక్కడే ఒకరిద్వారా తెలుసుకున్నాడు. ఆ సమయానికి జైలుదగ్గిర డ్యూటీలో వుండే గార్డు లెంతమందో కూడా తెలుసుకున్నాడు.

ప్రొద్దుగుంకే వేళకు, జోన్స్ అతని సైనికులూ కలిసి గుర్రాలమీద, జైలు రోడ్డున, కొంతదూరంపోయి, అక్కడ ఒక కొండమీద ఆగారు.

మెల్లగా ఒక ఫాసిస్టులారీ అటువైపు వచ్చింది. "ఏయ్, చికో, ఆపు!" అని జోన్స్ కేక పెట్టాడు.

డ్రైవరు కారాపి, శాల్యూటు చేసాడు. అతని ప్రక్కసీటులో ఒక సార్జెంటు కూర్చొని వున్నాడు. "చిత్తం"

"మా కారు చెడిపోయింది. మమ్మల్ని కూడా తీసుకెళ్లాలి."

లారీ వెనక సీటులో ఇద్దరు ఖైదీలున్నారు. వాళ్లనుచూసి "కమ్యూనిస్టు కుక్కలు" అని జోస్ గొణుక్కొని, సార్జెంటుకొకసిగరెట్ అందించాడు. "అడగడం మరచాను - ఈ రాత్రికి సంకేతం ఏమిటి?" అని జోస్ అడిగాడు. అయితే అదిఎవర్నీ ప్రత్యేకించి అడగడం కాదు.

"రైఫిల్" అని సార్జెంట్ సగౌరవంగా జవాబు చెప్పాడు.

"రైఫిల్!"

... ... ...

ఆ డ్రైవరు సార్జంట్ల కళేబరాలు రోడ్డు ప్రక్కన మరుగు పరిచిన తరువాత, కామ్రేడ్ యాంక్ కారు నడుపసాగాడు. వెనక సీటులోవున్న ఖైదీలకు, జైలువద్ద ఏమి జరుగనున్నదీ, జోస్ చెప్పాడు. జైలుకు కొద్దిదూరంలో, తమకు వెనకవైపు రక్షణకుగాను, జోస్ ముగ్గురు సైనికుల్ను దించేసాడు.

జైలు దగ్గరకువచ్చి, జోస్ తక్కినవారూ, తుపాకులు తీసుకొని, కమ్యూనిస్టులను తిడుతూ, లారీలోంచి బయటికి దూకారు. ఆ యిద్దరు ఖైదీలవైపూ, పిస్టల్ గురిపెట్టి, జోస్ వెనక్కు వెనక్కు జైలు మెట్లమీదికి నడిచాడు. గేటు తెరచుకొని ఒక ఫాసిస్టు సైన్యాధిపతి బయటకు వచ్చాడు.

"వీళ్లు గజ దొంగలు! గార్డులో వున్న తక్కినవాళ్ళనుకూడా పిలిపించండి. వీళ్లు పై రోడ్డు దగ్గర పారిపోవటానికి ప్రయత్నించారు. ఒకణ్ని కాల్చెయ్యాల్సొచ్చింది" అన్నాడు జోస్.

సైన్యాధిపతి బిగిల్ వేశాడు. "ఈ త్రోవనే, కాప్టెన్."

ఇప్పటి జైలు పూర్వం ఆలివ్ నూనెను పరిశుభ్రం చేసే ఫ్యాక్టరీగా వుండేది. జోసూ, తదితరులూ కలిసి, ఆఫీసులోకి ప్రవేశించారు. ద్వారానికి ఎదురుగా కొత్తగా ఏర్పాటు చేసిన ఒక ఉక్కు తలుపు కనిపిస్తున్నది. ఒక ప్రక్కన బల్లా, దాని మీద టెలిఫోనూ వున్నాయి. ఆ ఉక్కు తలుపు తెరచుకొని పదిమంది రైఫిల్సుతో వచ్చి, ఖైదీల కెదురుగా బారు దీర్చి నిలబడ్డారు. బల్ల వెనుక ఒక కీలక స్థానంలో జోస్ నిలబడ్డాడు.

"ప్రతి ఒక్క సైనికుడూ ఈకుక్కల్ని జాగ్రత్తగా పరిశీలించాలి. ఇక్కడ ఇంకా ఎవరైనా సైనికు లున్నారా? అందరూ వీళ్ళను బాగా గుర్తించగలిగి వుండాలి."

"ఇంకా సైనికు లెవరూ లేరండి."

"చేతు లెత్తండి!"

ఎల్ ఫాంటాస్టికో సైనికుల చేతుల్లోనూ, ఖైదీల చేతుల్లోనూ ఉన్న తుపాకులు చూసి, ఫాసిస్టుల నోట మాట రాలేదు. గెరిల్లా సైనికులు ఫాసిస్టుల దగ్గిరున్న ఆయుధాలను వెంటనే స్వాధీన పరచుకొన్నారు. జోస్ టెలిఫోను తీగె తెంపేసి, "అవిగో అక్కడ సంకెళ్లున్నై. వాళ్ళందర్నీ ఆ ఉక్కుతలుపుకు బంధించండి" అని ఆజ్ఞాపించాడు.

వరండాలోంచి జైలుకొట్లదగ్గరకు గబగబా వెళ్ళిపోయాడు. "కామ్రేడ్స్, ప్రజాప్రభుత్వం పేరిట ఎల్ ఫాంటాస్టికో మిమ్మల్ని అభినందిస్తున్నాడు. బైటికి రండి! మీకు యిక సంకెళ్లులేవు. ప్రజాప్రభుత్వం వర్ధిల్లుగాక! ఫ్రాంకో నశించాలి!" అని అరిచాడు.

ఆ జైల్లో దాదాపు ముప్పైమంది ఖైదీలున్నారు. ప్రజాప్రభుత్వం ప్రత్యేకం విడుదల చేయవలసిందిగా కోరిన ఆ నలుగురు కామ్రేడ్సునూ పేరుపేరునా పిలిచాడు. కాని ముగ్గురుమాత్రమే పలికారు. ఒకతను చెప్పాడు: "రిక్కార్డో చనిపోయాడు. ఇప్పుడు నీవు బంధించిన సైన్యాధిపతి చేత నిన్న తిన్న దెబ్బలవల్ల అతను మరణించాడు."

... ... ...

బహుటు కామ్రేడ్ యాంక్ ట్రక్కు డిస్ట్రిబ్యూటరునూ, టైర్లనూ ధ్వంసం చేశాడు. అందరూ బయలుదేర బోతున్నారు. జోస్ కొంచెం ఆగి, ఫాసిస్టు సైనికులతో ఇలా అన్నాడు: "ఓ సైనికులారా, ప్రజాప్రభుత్వంమీద సానుభూతి వుంచండి. ఫ్రాంకో మిమ్మల్ని మోసగించాడు; ఆ హంతకులకు మీరు బలి జంతువులు. కాని, ఓ సైన్యాధిపతీ, వుత్తములైన కామ్రేడ్స్‌ను చచ్చేటట్లు కొట్టిన వీరుడా! నీ ధైర్యానికి ఎల్ ఫాంటాస్టికో నీకు బహూకరిస్తాడు!"

జోస్ తుపాకి ఎత్తాడు. కాని జాలి వహించాడు. డొక్కలో కాల్చకుండా తలలోంచి దూసుకుపోయేట్టు కాల్చాడు.

... ... ...

వాళ్లు ఆ కొండ చివర, గుర్రాలున్న చోటికి చేరుకున్నారా అంటే, ఆ పైన ప్రయాణం తేలికే. కాని అక్కడికి చేరడం సులభంకాదు. ఖైదీలు చాలా నీరసంగా వున్నారు. అడుగడుగునా నడిచే శక్తిలేక తూలి పడిపోతున్నారు. ప్రక్కన చేతి ఆసరా ఇస్తూ, దాదాపు సగందూరం నిలువుగా, ఆ కొండ త్రోవన, వారిని ఎత్తుకు పోవలసి వచ్చింది. తెలతెల వారుతున్నది. ఆకాశంలో ఉదయ కాంతులు కనిపిస్తున్నాయి. ఆ నల్లటి కొండల వరసలో తాము చేరవలసిన చోటును జోస్ గుర్తుపట్టాడు. అది ఎంతో దూరం లేదు. ఇంకా ఒక్క అరగంట.

వాళ్లకు వెనకాల ఎక్కడో అగాధంలో గుర్రపుగిట్టల సవ్వడి ఏదో అలికిడిగావుంది. కాని జోస్ విన్నాడు. "గుర్రపుదళం వస్తున్నది. నీ నడుముకు కట్టుకున్న తోటాలుతియ్యి. త్వరగా—" అని కామ్రేడ్ యాంక్‌తో అన్నాడు.

"ఆగు ఈ కామ్రేడ్స్‌ను అటు చెట్లగుబురు దగ్గరకు చేర్చనీ" అన్నాడు యాంకు. ఆ గుర్రపుదళాన్ని ఆపడానికి తామిద్దరే వుండిపోవాలని నాయకుడి అభిప్రాయమై వుంటుందని యాంక్ అనుకున్నాడు. "నీవు వట్టి ఆడదాని" వని జోస్ అతన్ని కోపంగా కసిరి, "ఒకేఒక దళం వస్తున్నప్పుడుకూడా ఎల్ ఫాంటాస్టికో సహాయం కోరుతాడని నీ వనుకున్నావా? వెళ్లు! ఈ కామ్రేడ్సును గుర్రాల దగ్గిరికి తీసుకెళ్లు. అక్కడినుంచి వారిని మన సైన్యాలలోకి తీసుకుపో! ఇది ఆజ్ఞ. దీన్ని వెంటనే పాలించు!"

కామ్రేడ్ యాంక్ వెళ్ళిపోయాక, జోన్స్, తనకన్నీరు తుడుచుకొని, త్రోవకు పైవరసవున్న ఒక పెద్ద బండచాటున మాటి కూచున్నాడు. మొట్టమొదటి ఆశ్వికుడి రాకకోసం ఆ బండమీదనుంచి పొంచి చూస్తున్నాడు. నడుముకు కట్టుకున్న చేతిబాంబును పైకి తీయబోయి, అంతలోనే మనసు మార్చుకొని, దాన్ని అలాగే వుంచేశాడు. తనదీ యాంక్‌ది- తూటాలబెల్టులు రెండూ, సిద్ధంచేసుకొని వుంచాడు. ఆటోమాటిక్ పిస్టల్ నిప్పులు కక్కడానికి తయారుగావుంది.

ఆ గస్తీదళంలో పదిమంది వున్నారు. అందులో ఇద్దరు జోన్స్ తీసిన తొలిదెబ్బకే హతమైనారు. మరొకడు పడిపోయి వుండొచ్చు. మిక్కినవాళ్లు గుట్టలచాటుకు తప్పుకున్నారు. జోన్స్ దాగివున్న ఆ పెద్ద బండమీదుగా తుపాకిగుండ్లు రివ్వున దూసుకుపోసాగాయి.

చాలాసేపు, దాదాపు ఒక గంటవరకు, మధ్యమధ్య ఆ కొండకోనల్లో ప్రతిధ్వనించే గుళ్ళవర్షం తప్పితే, మరేమీ జరగలేదు. అతనిచుట్టూ దూకుతున్న అగ్నిగోళాల తీవ్రధ్వని తప్పితే, మరేమీ లేదు. కాని, అతని చేతిలో తుపాకి వేడెక్కిపోతున్నది.

రెండు గుళ్లు అతని బుజం వెనుకవైపున తగిలాయి. కుడిచేయి తుపాకిమీదనుంచే జారిపోయింది. 'మాండోస్ ఆరిబాస్!' అనే ధ్వని కఠోరంగా వెనుకనుంచి వినిపించింది. ఒకచెయ్యి గాలిలో వ్రేలాడిపోతూంటే, రెండోచేత్తో నడుము పట్టుకొని, అతను లేచి నిలబడ్డాడు. ఆ గుట్టలమీదుగా దాటుకుంటూ ఫాసిస్టు అధికారి వచ్చి, జోన్స్ ముఖంమీద పిడికిలితో పొడిచాడు.

"లేరా, కమ్యూనిస్టు కుక్కా! నీదళం ఎక్కడుంది?"

"ఎల్ ఫాంటాస్టికో నన్ను యిక్కడ వుండమని ఆజ్ఞాపించాడు."

"వాడెక్కడున్నాడు?"

"వాడప్పుడే లోయలోకి దిగిపోయుంటాడు—కిరాతకుడు. చావమని-నన్ను ఒంటరిగా ఇక్కడ వదిలేసాడు—"

"నీవు అతనితో యెంతకాలంనుంచీ వుంటున్నావు?"

"ఇదే నేను రావడం మొదలు."

"వాడికి వార్తలిచ్చేదెవరు? వాడివన్నీ ఎట్లా సాధిస్తాడు?"

మతిలేని రైతులాగా, ఇకిలించి, "అయ్యో! ఈ విషయాలు మీకు చెబితే మీరు నన్ను చంపుతారు" అన్నాడు జోన్స్.

ఆ పక్క టెముకలనూ, పడిపోయిన బుజాన్నీ విరగకొడుతూ మళ్ళీ ఆ పిడికిలీ, బూట్లూ! అతను తూలిపోతున్నాడు; మూలుగుతున్నాడు; గావు కేకలు పెడుతున్నాడు.

"చాలు! ఆపండి! గెరిల్లాల నంబరినీ ప్రాణాలతో పట్టుకురావాలని ఆజ్ఞవుంది" అని బిగ్గరగా చెప్పాడు ఫాసిస్టు అధికారి.

సైనికులు జోన్స్‌ను లేవదీసి నిల్చోబెట్టారు. అధికారి అతనివంక ఒక విషపు నవ్వు నవ్వి అన్నాడు: "ముసిలాడా, ఏమీఅనుకోకు. నిన్ను హెడ్ క్వార్టర్సుకు తీసుకెళతాం. అక్కడ కల్నల్‌తో నీవు మంచిగావుంటే ఆయన నీతో మంచిగా వుంటాడు. ఏం?"

తుపాకిగుళ్ళు అతని బుజంలోనుంచి దూసుకుపోయాయి. రక్తం కారిపోయి దుర్బలంగా వున్నాడు అతని చొక్కా లాగూ రక్తపుముద్ద అయిపోయాయి. "కట్టుకట్టాలి. రక్తం కారి చచ్చిపోతాను" అని సణిగాడు. గొణుక్కుంటూ వాళ్ళొక కట్టుగుడ్డ తెచ్చిపెట్టారు. దాన్ని తీసుకొని, చొక్కాక్రిందిగా, ఆ గాయాల్లోకి కుక్కుకున్నాడు ఎడమచేత్తో, గాయపడినకుడిభుజాన్ని ఎత్తిపట్టిఆచేతినిచొక్కా గుండీలమధ్య ఇమిడ్చి, బెల్టు ఊతగా ఉపయోగించేట్టు చూస్తున్నాడు. నా బుజం కదలదు. అది వచ్చిపోయింది" అని చెప్పాడు.

అతను నడవలేనంత దుర్బలంగా వున్నాడు. వాళ్ళు, చనిపోయి సైనికుల్లో ఒకడి గుర్రంమీద, అతన్ని ఎక్కించారు. బాగావున్న చేత్తో ఆ జీను పట్టుకుని, తూలిపోతూ, అలాగే గుర్రానికి అతుక్కున్నాడు.

. . . . . . . . .

కల్నల్ హెడ్ క్వార్టర్సు పల్లె ప్రాంతంలో, చెట్లు నీడలు పరుచుకున్న కొండమీద, ఒక చక్కని భవనంలో వుంది.

తన విజయానికి పోలీసు అధికారి గర్వంతో ఉప్పొంగిపోతూ, "ఎల్ ఫాంటాస్టికో సైనికుల్లో ఒకణ్ణి పట్టుకొచ్చా"మని కల్నల్‌తో చెప్పాడు.

"ఆహా - చిట్టచివరకు-ఇప్పటికీ-మీకు మతిలేదు" అని, తనముందున్న బల్లమీద నుంచి ముందుకు వంగి జోన్స వంక పరికిస్తూ "అతనినుంచి మీరేం కనుక్కున్నారు?" అని అడిగాడు.

"చాలా కొద్దిగానే తెలుసుకున్నాం. తను మీదగ్గిరికి తీసుకు రావాలని పట్టుపట్టాడు. మీ రగనితో మంచిగావుంటే, అతనుమీతో మంచిగా వుంటాడట. ఇదీ ఏర్పాటు." అన్నాడు అధికారి.

కల్నల్ వంకచూసి, జోన్స్ వెకిలిగా నవ్వాడు. కల్నల్ కళ్లెర్రబడ్డాయి. ఆ గదంతా కల్నల్‌నౌకర్లతోనూ అధికారులతోను నిండిపోయివుంది.

"కొద్ది నిమిషాలు మాత్రమే వుంది, జోన్స్, కొద్దినిమిషాలే!"

"మంచినీళ్లు కావాలి - దేవుడిదయ — మంచినీళ్లు!"

గార్డు, కల్నల్ వంక, చూశాడు. కల్నల్ తల ఊపడంతో అతను జోన్సుకు మంచినీళ్లిచ్చాడు. జోన్స్ గటగట త్రాగేశాడు.

కల్నల్ నిదానంగా చెప్పాడు: "ఓ— అలాగా, ఇన్ని నేరాలు చేసి, ఇంకా బతకాలనుకుంటున్నావు! మూర్ఖుడా! నాస్తికుడా! చెప్పు, మరి, నీవుచెప్పేది నిజంగానూ వివరంగానూ వుండాలి!"

"చెపితే నన్ను చంపరని ఎట్లానమ్మకం?" అన్నాడు జోన్స్.

"స్పానిష్ ఆఫీసరు మాటనే నీవు శంకిస్తున్నావుగా?" అని కల్నల్, జోన్స్ మీదికెళ్లి, ముఖంమీద బాదేశాడు. "చెప్పు, వెధవా!"

ఈ దెబ్బతో జోన్స్ ముందుకు తూలిపోయాడు. అతనిచెయ్యి కల్నల్ మెడకు

పెనవేసుకు పోయింది. శరీరాలు రెండూ ఒరుసుకు పోతున్నాయి. అతని కుడిచెయ్యి చేతిబాంబుమీద కదలు తున్నది.

అతను పేల్చే 'పిన్' అందుకున్నాడు. అది వచ్చేస్తున్నట్లు అనిపించింది.

"చెపుతా. ఎల్ ఫాంటాస్టికోనుంచి నీకొక సందేశం తెచ్చాను. విను." అని బిగ్గరిగా అరిచాడు.

చేతిబాంబు ప్రేలి వాళ్ళిద్దరి శరీరాలు ముక్కలు ముక్కలైనా, బాంబుమాత్రం పెద్ద శబ్దం చెయ్యలేదు. ఎల్ ఫాంటాస్టికో- ఫాసిస్టుకల్నల్ దేహాలమధ్య ఆ బాంబు అంత గట్టిగా బిగుసుకుపోయింది

★

# ఏజంట్లకు —

నవంబరు డిసెంబరు నెలలలో 'అభ్యుదయ'ను వెలువరించ జాలనందుకు విచారిస్తున్నాం. ఇకనుంచీ 'అభ్యుదయ' ప్రతి నెలా పదవ తేదీకి సక్రమంగా వెలువడుతుంది.

ఏజంట్లందరు తాము 'అభ్యుదయ' కివ్వవలసిన బాకీలను జనవరి నెలలోగా పంపి మాతో సహకరించాలని కోరుతున్నాము.

మే నే జ రు,
అ భ్యు ద య.

# కవిత్వం: ఒక పరిశీలన

★ ★ శ్రీ విద్వాన్ విశ్వం

ప్రపంచంలోని ప్రతి మానవ కార్యం వలెనే కవిత్వంకూడ మానవునికీ, ప్రకృతికీ మధ్య జరుగుతున్న సంగ్రామంలోనుండి అవతరించిందే. ఆపోరాటంలో మార్పులు వచ్చేకొద్దీ, సమాజ స్వరూపంలో విభేదాలేర్పడేకొద్దీ కవిత్వంలోను మార్పులు, కూర్పులు, తీర్పులు, వస్తూవచ్చాయి.

ప్రాచీన కాలంలోని మానవుడు తన బాహ్యపరిసరాలను-ప్రకృతిని తన కనుకూలమైనదిగా తన జీవిత పునరుజ్జీవనానికి, రక్షణకు అనువైనదిగాచేసుకోవడం లోనేవిజ్ఞానం (సైన్సు) పొడసూపింది. అలా ప్రకృతిని తన బానిసగా చేసుకోవడంలోనే విజ్ఞానాన్ని సృష్టించుకున్నాడు.

విపరీతమైన మానవశ్రమ అవసరమైన రోజుల్లో, సంఘటిత శ్రమయే ఆశ్రయమైన రోజుల్లో, మొత్తం సంఘమంతా పనిచేసి సాముదాయక ప్రయత్నంమీదనే ఉత్పత్తి సాధ్యమయ్యే రోజుల్లో, తనకు ఉత్సాహాన్ని, శక్తిని ప్రసాదించే సాధనంగా కవిత్వాన్ని ఆలపించాడు. అంటే అప్పటి బాహ్య పరిస్థితులకు అనుగుణంగా సంఘాన్ని సవరించుకునేందుకు కవిత్వాన్ని తయారు చేసుకున్నాడు.

ప్రారంభంలో ప్రతి ఉత్తమ భావ ప్రకటనకూ, ఉన్నత విజ్ఞాన ప్రచురణకూ కవిత్వమే ప్రాతిపదికగాఉంటూ వచ్చింది. ఉపోగీతికలు మొదలు వైద్యశాస్త్రం, గణితశాస్త్రం వరకు కావ్యరూపంలోనే ఉంటూ వచ్చాయి.

ప్రపంచ వస్తు సముదాయములోనిఏక ధర్మత్వాన్ని, ఇంద్రియ గోచరమైన ప్రకృతిలోని రహస్యా

లను విజ్ఞానం వెలువరిస్తుంది. అలాగే మానవుల భావాలలోని సమాన ధర్మతను, ప్రకృతిలోని వస్తు సముదాయంపై మానవ దృక్పథ విశేషాలను కవిత్వం విశదీకరిస్తుంది.

కవిత్వము, విజ్ఞానమూ రెండూ మానవుని కార్యోన్ముఖుని చేసి, పురోగమింప జేసే ఉత్తమ సాధనాలు.

కవిత్వం భాషా రూపమైనది. కాబట్టి అందులోని ధర్మాలిందులోను సంక్రమించాయి. తన భావాన్ని ఇతరులకు తెలియజేయడం, ఇతరుల భావాలను మార్చడానికి ప్రయత్నించడం - తన భావాలను ఇతరుల మనః ఫలకంలో ప్రతిబింబించేలా చేయడం - ఇవీ భాషాధర్మాలు.

కవి ప్రపంచాన్ని తన తావు నుండి చూచి, దానివల్ల కలిగిన హృదయస్పందనాన్ని, తనలాంటి ఇతర మానవుల్లోనూ కలిగించేందుకై, కార్యతత్పరులను చేసేందుకై ప్రయత్నిస్తాడు.

వచన రచనలు - నవల - నాటకం - విధులు ఇవికూడా భాషా రూపమైనవే కాని వానికీ కవిత్వానికీ భేదముంది. నవల మొదలైన వచన రచనల్లో రచయిత ఒక వాస్తవ ప్రపంచ ప్రతిబింబాన్ని సృష్టిస్తాడు. ఆ ప్రపంచాన్ని వివిధ దృక్పథాలతో, వివిధ వ్యక్తులెలా చూస్తున్నారో - అందులో వారెలా ప్రవర్తిస్తున్నారో చిత్రిస్తాడు. ఆ విశ్వవీధులలోనికి పాఠకుని ప్రవేశపెట్టి, తాను తెరవెనుకకు జారుకుంటాడు.

కవిత్వమలా కాదు. అది స్వీయ భావాల సంపుటి. వివిధ వస్తువుల మీదా, సంఘటనల మీదా వ్యక్తుల్లో కలిగే భావవిభేదాలను చిత్రిస్తుంది.

కవిత్వం పదబద్ధమైనది. అందులోని ఒకొక పదము ఒకొక ప్రపంచాన్ని సృష్టి చేసుకొన్నది. తనచుట్టూ భావతరంగాల గీతలు గీస్తున్నది కవిత్వంలోని ఒకొక పదాన్ని మనం వింటూ, ఆ యా పదాలవల్ల ఏర్పడే వస్తు సముదాయాన్ని మనం చూడడం - ఆ పదాలన్నిటితో అభివ్యక్తమయ్యే ఒక భావనా విశేషాన్ని మనం అనుభవిస్తాము.

ప్రతి వాస్తవిక గేయమూ ఇందుకు ఉదాహరణే. "గర్జించు రష్యా, గాండ్రించు రష్యా" అన్నప్పుడు మనకేం కనబడుతుంది? "ఆ మెకన్నుల లోన నంతాంబరంపు నీలి నీడలు కలవు" అంటే ఏం భావించుకుంటాం?

"నటధూర్జటి నిటాలాక్షి, నిటాలాక్షి పతాలుమని పగిలింది" ఇందులోని పదాలన్నిటికి వేరు వేరుగా అర్థం చెప్పుకొని వాటన్నిటికి దండాన్వయం రాయడానికి వీలవుతుంది. కాని ఆ దండాన్వయం — లేదా తాత్పర్యం - కవిత్వం కాదు

కాబట్టే కావ్యాన్ని అనువదించడమంటే- మరో కావ్యాన్ని ఇంకో భాషలో రాసేతప్ప -తలకు మించినపని. ప్రసిద్ధ అనువాదాలు కొన్ని ఉన్నమాట వాస్తవమే: ఫిట్జెరాల్డు 'రుబాయత్' హాళ్ళపల్లి 'గాథా సప్తశతి'-ఇలాంటివి. కాని ఇవి మరో భాషలో వ్రాసిన స్వతంత్ర కావ్యాలవంటివి. ఇక తిక్కన నన్నయలవి స్వతంత్ర కావ్యాలనడంలో విభేదాలే ఉండవు.

కాబట్టే కవిత్వం ఒకొక పదానికికాక ఆ పదసముదాయం వల్ల ఏర్పడే భావప్రపంచాన్ని సూచిస్తుందంటాము.

వచనం అలాంటిది గాదు. అందులో ఒక అంశాన్ని సకారణంగా స్పష్టంగా వివరిస్తాము. అందులో మనవ్యక్తిత్వం మరుగుపడి విషయ నివేదనం ప్రాధాన్యత వహిస్తుంది.

వివిధ వ్యక్తుల భావాలు, ఆ వ్యక్తులమధ్య, వర్గాలమధ్య ఉన్న సంఘర్షణ, సామాజిక సంబంధాలు వివరించుకుంటాము.

రోమారోలాం, "జీన్ క్రిస్టఫీ" గాని, టాల్‌స్టాయి "వార్ అండ్ పీస్" (యుద్ధమూ - శాంతీ) గాని, మరింకే నవలగాని ఒకొక్కటి ఒకొక ప్రపంచం. ఒక దశలోని విభిన్న మానవ ప్రకృతులను, సమాజంలోని సంఘర్షణలను అవి వివరిస్తాయి.

ఇంతకూ ప్రకృతిలోని విభిన్న విషయాలపై వ్యక్తిగత వైఖరిని వివరించేది-కవిత్వం. విభిన్నవ్యక్తుల సంఘటనల వివరాలను విశదీ

కరించేవి నవలలూ - నాటకాలూ మొదలైన వచన రచనలు.

వ్యక్తిగత భావ ప్రకటనమంటే ఒకొక వ్యక్తికి మాత్రమే చెందిన భావాల సంపుటికాదు. కొందరు వ్యక్తులకు చెందిన సమాన ధర్మాల ప్రకటన అది.

నాకొక ఆపత్కరమైన వార్త వస్తుందనుకుందాం. ఎవరో ఆప్తులు జబ్బుపడినట్టుతంతివార్త రావచ్చు- అందువల్ల నా ఒక్కనిలో విచారం అనే భావాన్నది కలించవచ్చు. దానినే మీకు చూపితే— సం విషాదం మీకు కలగదు. అలాగే నాకో లక్షరూపాయలు వచ్చినట్లు జాబువస్తే - మీలో ఏమీ ఆనందమూ - సంబరమూ కల్గించలేదు.

మానవుడు ప్రకృతితో నడిపే పోరాటంద్వారా కొన్ని సమాన ధర్మాలను సృజించుకున్నాడు- వాని విశదీకరణమే కవిత్వం. మానవానుభూతి సముదాయాన్ని ఉన్మీలితం చేయడమే దీనిపని

మానవుడు ప్రకృతి రహస్యాలను కనుక్కుంటాడు. ఒకొక సత్యాన్ని కనుక్కున్నప్పుడు- కొన్ని మార్పులువస్తాయి-మరొక సత్యాన్ని తెలుసుకునేందుకు- సమాజాన్ని మరింత ముందుకు కొనిపోయేందుకు తిరిగీ అతను ప్రయత్నిస్తాడు. ఈ అనాదీ-అనంతమూ అయిన సంగ్రామంలో మానవుడికి చేదోడు వాదోడుగా ఉంటూ ముందుకు నడిపించడమే కళకూ విజ్ఞానికీ కూడాపని.

ఇంతేకాదు-కవిత్వం రీత్యా శ్రేయం-అంటే అదొక విధమైన గతిలో-లయతో - సంబద్ధమై ఉంటుంది.

ప్రారంభంలో ఇది పాటల రూపంగా సంగీతంలో కవిత్వంలో సంబద్ధమై ఉండేది. ఇందులో స్వర సమ్మేళనానికున్న ప్రాధాన్యం విషయ వివరణకు ఉండదు. 4+4=8 అనేలాంటిదిగా కవిత్వమెన్నటికీ ఉండలేదు.

సాధారణంగా మనం నిత్య వ్యవహారంలో ఉపయోగించే భాష, మరింత ఉత్తమస్థాయికి వెడుతుంది. భావవ్యక్తీకరణకు భాషను సునిశితమైన సాధనం చేయడానికే ఈ పని జరుగుతుంది

సంగీతం అందుకు చక్కని శక్తిని ప్రసాదిస్తుంది.

కాని ఈ కవిత్వం ప్రారంభంలో పదిమందీ కలసి పాడుకునే పాటలుగా ఉన్నప్పటికీ, క్రమంగా నేటి వచన కవిత్వంలోనికి దిగుతున్న మాట నిజమే. ఇందుకే మన మొకసారి క్రమంగా ఇదెందుకుమారిందో తెలుసుకోవాలి-అంటే కవిత్వానికి మూలమైన సమాజంలోని మార్పులను కూడా గమనించాలి. (అతిసంగ్రహంగా మాత్రమే ఈ విషయం ప్రస్తుతానికి వివరిస్తాను)

ప్రాథమిక దశలో మానవుడు ఏకాకిగా పనిచేయ వీలులేదు. ఉమ్మడిగా మాత్రమే ఉత్పత్తి చేయ వీలయ్యేది. ఇలాంటి దశలో మానవులందరిలో కార్యోత్సాహాన్ని సృష్టించే కవిత్వం పదిమందీ కలిసి పాడుకోవలసిన రూపంలోనే ఉండేది.

ఇందుకు ప్రాచీన సాహిత్యమంతా అదిఏదేశందికానీ - పద్య రూపంలో, పాటల రూపంలోనే ఉంటూ వచ్చింది.

మన వేదవాఙ్మయంచూడండి. అతి ప్రాచీనమైన ఋగ్వేదములోని అనంత ఋక్కులన్నీ ఇలాంటివే. వ్యవసాయానికి ప్రాణమైన నాగలిని మొదలుకొని,అందరికీ కాంతిని ప్రసాదించే ఉషోదయంవరకు అందులో స్థానం సంపాదించుకున్నవి. ఆ మంత్రాలన్నీ పదిమంది కలిసి పఠిస్తున్నప్పు డెంత శ్రావ్యంగా, సంగీతమయంగా ఉంటాయో తెలుస్తుంది.

అలాగే వాల్మీకి కవిత్వ ప్రారంభంగూర్చిచెప్పేకథా,మనకు తెలుపుతుంది. క్రౌంచమిథునం ఆనందిస్తుండగా ఒక బోయవాడు అందులోని ఒక పక్షిని చంపుతాడు. అక్కడేవున్న వాల్మీకి హృదయ మందులో కంపించిపోతుంది. వెంటనే ఆ భావావేశంలో "మానిషాద ప్రతిష్ఠాం త్వమగమ శ్శాశ్వతీ స్సమాః" అంటాడు.(ఓ నిషాదుడా!నీవు చాల నాళ్ళు బ్రదకవు.) అదే సంస్కృత కవిత్వానికి ఆరంభమని ప్రాచీన గాథ.

ఇలాంటిసాముదాయక కవిత్వం సంఘ పరంగా ఉత్పత్తి సాధనా

లుండి, ఉమ్మడిగా పని చేసుకునే రోజుల్లో వర్ధిల్లింది.

కాని సమాజంలో రానురాను రెండు వర్గాలేర్పడినవి. రాజులు అవతరించారు. పాటక జనానికీ పై వారికీ మధ్య అగాధం ఏర్పడింది.

ఇంతటితో కవిత్వం రాజాస్థానాలలోకి దూరింది. కవిత్వం, సార్వత్రిక స్వామికులైన సర్వమానవుల నుండి విడిపోయి, ఒక వున్నత వర్గాన్ని, ఆ వర్గాన్నాశ్రయించిన మేధావి వర్గాన్ని ఆశ్రయించింది.

ఇప్పటికే కవిత్వంలో మార్పు వచ్చింది. మనుషులందరు కార్యోన్ముఖులై పంటల పండుగల్లో, ప్రకృతిలోని వినూతన విలాసాలను చూచి, కార్యోత్సాహాన్ని సంపాదించుకునేందుకై, తమ ముందొక నూతన ఆశయాన్నుంచుకొనిపురోగమించేందుకై పాడుకుంటున్న కవిత్వము మారిపోయింది. సాము దాయిక గానంనుండి తొలగింది.

ఒకడు చదివి వినిపించే వీర గాథలరూపం తాల్చింది. ఆ వీర గాథలు సభాస్థానాలలో వినిపించే వారు. సభాసదులాగానంలో పాల్గొనక, శ్రోతలుగా మాత్రమే ఉండి ఆనందోత్సాహాలను అనుభవించేవారు.

రామాయణాన్ని కుశలవులు గానంచేశారు. అలాగే పురాణాలను సూతుడు సభాసదులకు వినిపించాడు. అనేక గాథల్లో కూడ ఈ సత్యం సూచితమైంది.

ఈ దశలో కవిత్వంలో వచ్చిన మార్పు అంతతో ఆగలేదు— కారణం :సమాజంలో వచ్చిన మార్పుకూడ అంతతో ఆగలేదు కాబట్టి.

క్రమంగా పెట్టుబడిదారీ దశ ఆరంభమయింది. సంఘంలో నికార్మికవర్గం, ధనికవర్గం ఖచ్చితంగా వేరుపడి పోయాయి. ఉత్పత్తి సాధనాల స్వత్వం ఒకరి చేతిలో నిల్చింది. శ్రమ మాత్రం ఒకరి పాలయింది.

ఈ ధనిక సమాజ కరాళదంష్ట్రిల్లో అసంఖ్యాక పాటక ప్రజ తగుల్కొన్నది. మధ్యతరగతి మేధావి వర్గంలో నిరాశా నిస్పృహలు బయలుదేరాయి.

కవిత్వం పదిమంది కూర్చొని పాడుకునే దశలన్నీ గడచి

పోయాయి. తానొక్కడే డ్రాయింగు రూములో, తలుపు బిగించుకొని కూర్చొని చదువుకునే స్థితి ఏర్పడింది. ఇంతలో సంగీతానికి, రీతికి కవిత్వానికి ఉన్న పొత్తు మరింత చెడిపోయింది. మనసులో చదువుకునే పద్యానికి గమనం, లయ, రీతి కొంత దూరమయింది.

ధనికయుగంలో సంక్షోభం ఏర్పడింది. దీనితో పాటు మరొక రకం విపరీత ధోరణులు, విచిత్ర రీతులు కవిత్వంలో రావడానికి కూడా కారణం లేకపోలేదు.

ధనిక యుగంలోని పాడు సంఘంలోని కుళ్ళు, బానిసత్వం అసమానత, వ్యత్యాసాలు, వైరుధ్యాలు ఉన్నత వర్గ భావాలను వ్యక్తీకరించే కవుల్లో నిరాశను ప్రేరేపించాయి.

ఈ కవి పతిత ప్రజా సముదాయంలో కలసి పోలేక ఉన్నత వర్గీయుడుగా ఉన్నంత కాలం, తానా ప్రజాకోటి భావాలను వెలువరించలేదు. మరి తాను బానిసనని ఒప్పుకోకుండా, ఏదో అస్పష్టమైన స్వతంత్రం కోసం, నియమాలు లేనిఅరాచకత్వం కావాలనే ధోరణికి దిగుతాడు. ఉన్న నియమాలను ఎదిరించాడు, ధిక్కరించాడు. ఆకాశములోనికి వెళ్ళాలని ఎగిరి, తిరిగి ఆధునిక సమాజపు బురదగుంటలోనే పడిపోయాడు.

ఈ దశలోనే అనేక రకాలైన కవిత్వాలు పుట్టాయి. సర్రియలిజం లాంటివి ఈ రకానికి చెందినవే. సమాజంలోని వర్గవిభేదంవల్ల ఏర్పడిన భయంకర వైరుధ్యాలను గమనించి తాను స్వతంత్రం పొందుతానంటాడు - కాని వర్గ విభేదాలను విధ్వంసం చేసేందుకతను పాటక ప్రజలతో చేరడు.

వ్యక్తిత్వవాదంతో నిండిపోయిన ఈ కవి, రాజకీయాల్లో అరాచకవాదిలాగే, అన్ని నియమాలు లేని స్వతంత్రం కావాలంటాడు. కాని, ఆ దాస్య శృంఖలాలను తప్పదారినుండి చీల్చాలని ప్రయత్నించి విఫలుడవుతాడు. అందుకనే కల్మష భరితమైన సమాజాన్ని బాగు పరచడానికి పూనుకోడు. తన మానసిక ప్రపంచంలోనే ఒక గూడు నిర్మించుకుని అందులోకి అంతర్హితుడవుతాడు.

తన మనస్సులో జరిగే ఆలోచనా పరంపరను- ముడి సరుకుగానే- బయటపెడతానంటాడు. ప్రజలను ముందుకు నడిపే కవిత్వం కాక, తనకు మాత్రమే - అది కూడా ఒకొక్కప్పు డనుమానం- అర్థమయ్యే విచిత్ర రీతుల కవిత్వ మల్లుకుంటూ కూచుంటాడు.

ఈ దశ దాటి శ్రామిక ప్రజాకోటిలో చైతన్యం అంకురిస్తుంది. ఈ సమాజాన్ని స్వర్గరాజ్యం చేయాలని వారు పూనుకుంటారు.

పెరిగి సంఘటిత శక్తిలోని అపార బలాన్ని శ్రామిక మానవుడు గ్రహించాడు. అత నీదారుణ పరిస్థితినుండి సమాజాన్ని, మానవ కోటిని తప్పించి, నూతన ప్రజాతంత్ర రాజ్యనిర్మాణం కోసం పూనుకున్నాడు.

ఈ అభ్యుదయ ప్రజానీకంలోనుండే, అభ్యుదయ కవిత్వం, నిజమైన కవిత్వం తిరిగి పొడసూపుతున్నది.

ఈ దశలోన మనకుతిరిగి ప్రజాకవిత్వచ్ఛాయలు కనుపిస్తున్నవి.

ప్రజలను కార్యోన్ముఖులను చేసే కవిత్వం, పదిమంది కలిసి పాడుకునే కవిత్వం, పాటక ప్రజ మనోదృక్పథాలను, వైఖరులను, ఆశలను, ఆదర్శాలను ప్రతిబింబించే కవిత్వం నేడు కనిపిస్తున్నది.

అంధకారంలో నిమగ్నులై ప్రాఙ్ముఖులై వెలుగుకోసం కాచుకున్న ప్రాచీనులు,ఉషః కాంతులను చూచి గానం చేశారు. "అసతో మా సద్గమయ, మృత్యోర్మా అమృతం గమయ, తమసోమా జ్యోతిర్గమయ-"అని ఆలపించారు. "తెల్లవారింది మేల్కొనండి పనులకు పదండి, ఆవులను విడువండి," అని ఆ ప్రాచీనులన్నారు.

అవేఋగ్వేదరూపంతాల్చాయి.

అలాగే నేడు పాటక ప్రజానీకమూ, కార్మిక కర్షక సంఘటిత వర్గాలూ, అభ్యుదయ మేధావి వర్గమూ ఈ పెట్టుబడిదారీ సమాజపు కారుచీకటులనుండి విడివడ జూస్తున్నారు. నూతన సమాజ నిర్మాణం కోసం కృషిచేస్తున్నారు.

ఈ నూతన యుగోదయంలోని ఉషః కాంతులను గానంచేసే ప్రజాకవిత్వం, (మిగతా 68 వ పేజీలో)

# శాంతి లేదు!

శ్రీ అనిశెట్టి సుబ్బారావు



అంతఃపురంలోని విశ్రాంతి భవనంలో మహారాజు— ఆలోచనలో, ఆవేదనతో ఎదురు చూస్తున్నాడు. ఎదురుగా కొద్ది దూరంలో జ్యోతిషుడు— గ్రంథాలు తిరగవేస్తూ, వేళ్లతో దేనినో గుణిస్తున్నాడు. కవి— గోడలమీద వరసగా అలంకరించిన రాజవంశీయుల తైలవర్ణ చిత్రాలు వీక్షగా చూస్తూ, పచార్లు చేస్తున్నాడు చిరునవ్వు నవ్వుకుంటున్నాడు. ఒకరిద్దరు పరిచారకులు— స్తంభాలన్నీ పూలగుత్తులతో అలంకరిస్తున్నారు. గోడల మీద పులి చర్మాలు, పాలరచ్చ మీద తివాచీలు తుడుస్తున్నారు. ఆ భవనం అంతా దేని కోసమో ఎదురు చూస్తూ యోచనలో మునిగి వుంది.

కవి మెల్లగా కదిలి వెళ్లి, విశాలమైన కిటికీ నుంచి బైట దూరంగా కనిపించే నీలి కొండల మీది బరువైన మేఘాల వంక చూస్తున్నాడు.

మహారాజు :

ఎలావుంది? ప్రకృతి ఏమంటోంది ఇవాళ?

కవి :

వరివెన్నులమీద మొయిలు విడిచిన సూర్యకాంతి మెరుస్తోంది. కాని, వెన్నులెందుకో దిగులుగా వేళ్ళాడి పోతున్నాయి. ఎంత నిండైన మేఘాలు! కాని, భారంగా కదలలేకపోతున్నాయి. పడతి శిరోజాలలో పూలగుత్తులు తురిమినట్లు ఆవులగుంపులు కొండల మీద పడుకున్నాయి. రాత్రి కురిసిన వానతో భూమి కమ్మని వాసన: ఒళ్లు పులకరిస్తోంది.

మహారాజు :

ప్రకృతి ఎలావుందని అడిగాను! ఇటుచూడు, నావంక: ప్రకృతి ఏమంటోందన్నాను!

జ్యోతిషుడు :

చిత్తం ప్రభూ! ప్రకృతి... అతి దీనంగా వుంది... ఇవాళ మీ మనస్సు వికసించలేదు... అందుచేత దీనంగా వుంది.

మహారాజు : పరిహాసంగా

కాని, కవికి నా మనస్సుతో నిమి త్తం లేదు. ఎప్పుడూ బైటికే చూస్తాడు. బైటికి పంపాలేమో: మా పితామహులు ఒక ఆస్థాన కవిని బైటికి పంపారట: అతను తిరిగితిరిగి వచ్చి గతిలేక కోట గుమ్మంలోనే చనిపోయాడు. జ్యోతిశ్శాస్త్రజ్ఞులు చెప్పగలరా? ఇలాంటి సమయాల్లో నా మనస్సు యెప్పుడూ మా పూర్వుల స్మృతుల్ని రేపుతుంది. 15 వ శతాబ్దంలో మొదటిసారి మా వంశం రాజరికం పొందింది.

జ్యోతిషుడు:

18వ శతాబ్దంలో ఇప్పటికి మూడింతలు రాజ్యముండేది. ఆ రోజులు వేరు. గ్రహస్థితులన్నీ అప్పుడు ఉచ్ఛదశలోవుండి చక్రవర్తిత్వం దిగంతాలకు వ్యాపించింది. ఈ ఉదయమే సుపుత్రుడు కలుగుతాడని తారాబలం చెపుతోంది. రాజరికం వర్ధిల్లటమే కాదు, ఇకముందు వ్యాపించి తీరుతుంది.

మహారాజు :

ఇలా ఎన్నోసార్లు చెపుతున్నావు! ముగ్గురు బిడ్డలు పుట్టారు. చనిపోయారు. నాకు పుత్రసంతానం కలిగి తీరాలి. అలాగ ఆజ్ఞాపించటానికి అధికారం వుంటే బాగుండు! మా పూర్వులు ఈ సింహాసనం, ఈ దేశం, ఈ ప్రజలు అన్నిటినీ నాకిచ్చారు. నేనుకూడ ఇచ్చేస్తాను. కాని పుత్రుడు కలుగుతాడా? మళ్ళీ గుణించి చూడు-నవ్వుతావెందుకు కవీ! ఔను నవ్వు. ఈసారి మహారాణి బిడ్డ బ్రతక్క-పోతే వీధివీధికీ, ఇంటింటికీ తిప్పి ఆమెను చిత్రవధ చేయిస్తాను-నిన్నే! మహారాజు పలుకుతున్నప్పుడు నవ్వి ప్రాణసంకటం తెచ్చుకుంటావు!

కవి :

మహారాజులు ఈ కిటికీలోనుంచి బైటికి చూడరేం! ప్రకృతిలో యెన్ని చిత్రమైన సంఘటనలు జరుగుతుంటాయో మహారాజులకు తెలియదు! మీరు తెచ్చి పెంచుతున్న అనాథబాలుడు ఎప్పటిలాగా తోటలో పూలు కోసి రాసులుపోశాడు. కోటగోడ నెక్కి-దూకబోతున్నాడు. భటులతన్ని

పట్టుకుంటే యెప్పటిలాగే కలియ బడి రక్కుతున్నాడు.

మహారాజు :

అందమైన బాలుడే కాని అడివి జంతువు. కోటగోడ నెందు కెక్కుతాడో ఏమోమరి! ఒకసారివచ్చి హఠాత్తుగా "నాకు బైటే బాగుంటుంది" అన్నాడు. నేను నవ్వాను. ఎప్పుడో ఒకనాడు వాహ్యాళి వెడుతూంటే చెట్లెక్కి పాడుతున్నాడు. దయతలిచి తెచ్చాను. కాని, అతనికో యెప్పుడో ఆపదవస్తుంది -

శిశువు ఉదయిస్తుందని రాత్రి నుంచి పట్టణం నిశ్శబ్దంగా వుండాలన్నాను. అతను అల్లరి చేస్తే పట్టుకుని వుంటారు - నా రక్తం స్వరూపం పొంది పుత్రుడు జన్మిస్తే అదీ సార్థకత: ఇవాళంతా దైవ ప్రార్థనలు జరిపించమని ఆజ్ఞాపించాను. మంగళ తూర్యనాదాలు విన్పిస్తున్నాయా!

హఠాత్తుగా కేకలు, జయనాదాలు విన్పిస్తాయి. కిటికీ వద్ద కవి పెదవులు బిగుసుకు పోతాయి. మహారాజు లేచి నిలబడి జ్యోతిషుని వంక చూస్తాడు.

మహారాజు :

ప్రసిద్ధ వైద్యులంతా వచ్చి మహారాణి భవనంలో హాజరుకావాలని ఉత్తర్వులుపంపాను. ఏమిటా కేకలు ఏమిటా ఆర్తనాదాలు!—జవాబు?

కవి :

పుత్రులు మానవులకు కలుగుతారుగాని దేవుళ్ళకు కాదు. అందుచేత దైవప్రార్థనలు చెయ్యడం నిష్ప్రయోజనం. ప్రజల సుఖ సంపదల వల్ల రాజరికం నిలుస్తుంది గాని ఉరికంబాల వల్ల కాదు!

మహారాజు :

ఇప్పుడెవరి నైనా ఉరితీశారా? వేళ గాని వేళలో ఉరితియ్య టమేమిటి! అడుగో, మహామంత్రి వస్తున్నాడు - ఏమిటా కేకలు? రాజప్రాసాదం మార్మోగింది.

మంత్రి : నిశ్చలంగా

ఆయుధాగారం దోచిన దేశద్రోహుల్ని అత్యవసరంగా ఉరితీయించాను. ఆగ్రహిస్తే నేను ప్రభుత్వాన్ని నడపలేను.

మహారాజు :

ఉరి తియ్యరాదని నేనన్నానా? మహారాణి మనస్సు చీకాకుపరచ వద్దన్నాను!

జ్యోతిషుడు :
రోజు రోజుకూ ఆర్త నాదాలు, తుపాకి కాల్పులు విని ఏలినవారి యోచనకు భంగం కలుగుతున్నది. మహారాజు మనస్సు సున్నితమైంది. మీకు చెప్ప నవసరం లేదు.

కవి :
మహారాజు వాహ్యాళి వెళ్లి రావటం అవసరం. పరిస్థితి తేటతెల్ల మవుతుంది.

మంత్రి :
అయాచితంగా సలహా లిచ్చిన వారిని గూడ శిక్షించే అధికారం మహారాజుకు వుంది— [జ్యోతిష్యునితో] మీ రొకసారి వైద్యులతో సంప్రదించిరావాలి

కవి :
మీకోసమే ఈ సలహా. వీధి లాంతర్లన్నీ ఉరి కంబాలుగా మార్చిన మహామంత్రికి ఈనాము లిప్పించాలని నా కోరిక.

జోతీషుడు వెళ్ళిపోతాడు

మంత్రి :
మహారాజుకు విన్నవించు కుంటున్నాను. రాజవంశాన్ని నిలబెట్టడానికి మా పూర్వులు అనేక యజ్ఞయాగాదులు చేయించారు. సంగ్రామాలు నడిపారు. ఎందరో శత్రువుల్ని ఉరి కంబా లెక్కించారు. పదేళ్ల క్రితం నేనే స్వయంగా శత్రు రాజు శిరాన్ని కోట గుమ్మానికి వ్రేలాడ గట్టాను......

మహారాజు : నవ్వుతూ
మా మంత్రి ఏదో ఆందోళనలో వున్నాడు. అంతేనా? అసలు విషయం ఏమిటి?

మంత్రి :
చెప్పనా? ఈ కవిని బైటికి గెంటి వెయ్యండి! ఇతడు కోటలోని రహస్యాలన్నీ బైటికి పొక్కి మీకూ, మాకు ముప్పు తెస్తున్నాడు. శత్రువులలో చేరిపోయాడు.

మహారాజు :
మనకు శత్రురాజులే లేరే! ఏమికవీ?

కవి :
రాజులు లేరు. కాని ప్రజలున్నారు. తిండి లేని ప్రజలున్నారు—ఒక గీతం పాడనా? నాకు రాత్రి కలవచ్చింది. అద్భుతమైన కల; మహారాజు విని తీరాలి!

మంత్రి :
గీతాలు, స్వప్నాలుకాదు వినేది— గెంటండి అవతలికి... నే నైనా శెలవు పుచ్చుకోవాలి, లేదా— అత నైనా బైటికి నడవాలి.

మహారాజు :
ఎందుకంత ఆవేశం! మీపై మాకు విశ్వాసం వుంది. మా భౌతికసుఖాలన్నీ మీ చేతి మీదుగా జరిపిస్తాము. ఆధ్యాత్మి కానందానికి కవులు తప్ప ఎవరున్నారు! ఇద్దరూ మాకు కావలసినవారే!

మంత్రి : క్రోధావేశంతో
ఈ కవి మొన్న రాత్రి ద్రోహుల ఇండ్లలో చేరి మనమీదకుట్రలు పన్నుతున్నట్లు గూఢచారులు చెప్పారు. నిజమే. ఇతని గీతాలు దేశమంతటా కార్చిచ్చులాగ వ్యాపించుతున్నాయి. ఇతను నేర్పిన దే ఇవాళ ఉదయం ఉరి తీసేటప్పుడు వాళ్లు పెట్టిన కేక. ఇతనికి రాజభక్తి లేదు.

కవి : చిరునవ్వుతో
కవులిక రాజుల నాశ్రయించరు. ఆ కాలం వెళ్ళి పోయింది. ఆదర్శాన్ని , సాధిస్తారు. కాలం వచ్చింది— మహారాజా! నా స్వప్నం విన్నారు కాదు! మహామంత్రి సెలవిస్తారా!

మహారాజు : సగర్వంగా
కవి విపరీతాలు పలుకుతున్నాడు. రాజాశ్రయం అక్కర లేనివారు ఉత్తరానికి దయ చేయవలసి వుంటుందని కవికి తెలుసు. అప్పుడప్పుడు మనోవైకల్యంపొంది ఇలా మాట్లాడడం అలవాటే. కాని, అతని కావ్యాలు, కలలు అద్భుతంగా వుంటాయి. వింటాను! ఎవరా నవ్వు! ఎవరురా!

ఒక పరిచారకుడు వచ్చి మంత్రి చెవిలో ఊది వెడతాడు.

మంత్రి : సవినయంగా
వైద్యులు ఆరామంలో నుంచి అంతఃపురానికి వెడుతూ నవ్వుకుంటున్నారు. రాజకుమారుడుజన్మిస్తే శ్రీరాముని వర్ణంలో వుంటాడా, శ్రీకృష్ణుని వర్ణంలోనాఅని వివాద వచ్చింది.

మహారాజు :
'జన్మిస్తే' అన్నావు. ఆమాట అశుభం సూచిస్తుంది. సరే వెళ్లు. వైద్యులకు సౌకర్యాలు చూడు!

కవి : పరిహాసంగా
మంత్రిగారూ! ఒక ప్రశ్న. చిన్న ప్రశ్న. ఆ బాలుణ్ణి ఎక్కడ బంధించారు? మీకు నినాదాలు విన్పిస్తాయి గాని ఆర్తనాదాలు విన్పించవే! బాలు డెక్కడున్నాడు? చూచిరావాలి.

మహారాజు :
కవీ! నీ కిప్పుడు తీరిక లేదు. మహారాజుకు మనస్సు చికాకుగావుంది. నీ స్వప్న మేమిటి?

కవి: స్మృతి తెచ్చుకుంటూ
రాత్రి మగతగా పడుకున్నాను. నా మనస్సు ఏవేవో భయంకర మైన దృశ్యాలు చూస్తూ, తిరుగుతోంది: నిశ్శబ్దమైన ఎడారి— ఉండి వుండి ఎడారి జీవంతో చలించటం ప్రారంభించింది. తెల్లగా, గౌర వర్ణంగా వున్న రేణువులు ప్రాణం తెచ్చుకున్నాయి. ఎర్రగా నిప్పు కణాలుగా మండుతున్నాయి. చుట్టూ దిగిపోయిన బోను వంటి ఆకాశం. ఒక చెట్టు లేదు; చెలమ లేదు. అక్కడి ప్రాణాన్నంతా నమిలి మింగి, ఆయాసంగా ఊపిరి పీలుస్తూ మధ్యలో ఒక కొండ చిలువ వుంది. చెలమలోని చల్లని నీరు, చేపలు, పచ్చని చెట్లు, ఫలాలు; విచ్ఛిన్నమైన జంతు సమూహాలు: ఎన్నో ఎన్నో: ఒకప్పుడు ఆ ఎడారిమీద ప్రాణం నృత్యోత్సవంజరిపివుంటుంది. కొండ చిలువ మిగతా ప్రాణజగత్తును మింగి తనొక్కటే బ్రతుకుతోంది. నిర్విచారంగా, నిర్లక్ష్యంగా ఊపిరి పీల్చుతోంది: ఎడారి మండుతోంది పగలాగా, భూమిలోనుంచి ఉబికే అగ్నిద్రవంలాగుంది. తెరలు తెరలుగా పైకిలేచి చుట్టుముట్టు తున్నది. దాని కండ్లలో, నోటిలో అంతటా మంటలే వ్యాపించాయి. చుట్టలుచుట్టుకొని మత్తుగా పడుకున్న కొండచిలువ వొళ్లు కాలుతోంది. చుట్టలు విప్పుకుని విసిరి విసిరి కొడుతున్నది. అదొక తుపాను; ప్రళయం...

మహారాజు : ఉద్రిక్తుడైలేచి పచార్లుచేస్తూ
నీకు పిచ్చెత్తింది. విశ్రాంతి లభిస్తే కొందరు కవులు మనస్సు చచ్చి పాపాణాలౌతారు. కొందరు స్వప్నాలుకని పిచ్చివాళ్ళౌతారు.

కవి : బాధపడుతూ
ఇది స్వప్నంకాదు, నిజం. ఇది జరిగి తీరుతుంది. విప్లవం జరుగుతోంది. మంగళ తూర్యనాదాలు విన్పిస్తున్నాయే - జాగ్రతగా వినండి! ఏమిటా కేకలు?

మహారాజు :
వైద్యులింకా రాలేదే! జ్యోతిషుడులగ్ననిర్ణయం చేశాడుగదా! ఐనా నాకు నమ్మకంలేదు. మీా

రెవరిలోనూ నమ్మకం లేదు. మంగళ తూర్య నాదాలు నా మనస్సును సంతోష పెట్టలేవు.

కవి : ఉద్రేకంతో

మీకు తెలియనక్కర్లేదేమో, ఐనా చెప్తున్నాను. అవి మహారాణి పుత్ర జన్మకోసం కాదు. పసి బాలురను పేము బెత్తాలతో శిక్షిస్తున్నారు. ఆ ఏడ్పులు విని మీరు కలవర పడతారని.

మహారాజు : ఆశ్చర్యంగా

ఇవాళ కావ్యాలు మాట్లాడుతున్నావే! నేను వీటిని గురించి యోచించ లేను నన్నేకాంతంగా శయనించనివ్వు — అనాథబాలుడు కందిన మొహంతో బెదురు చూపులతో వొణుకుతూ రాజుముందుకు వస్తాడు

— ఎవరది? ఎందుకొచ్చావ్! రా ఇటు : ఏమిటీ వెర్రిచూపులు?

బాలుడు : దీనంగా

మా అమ్మ! అమ్మ! అమ్మదగ్గరకి పోతాను. నన్ను రాత్రిం బగళ్ళు చీకటిగదిలో పెట్టి తాళంవేస్తున్నారు నన్ను వెళ్ళనివ్వండి... విడిచి పెట్టండి... మా అమ్మతో బ్రతుకుతాను... నాకు ఆకలౌతోంది.

మహారాజు :

ఛి! ఛీ! అంతఃపురంలో వుండి 'ఆకలి' అనవచ్చునా! ఆమాట ఇక్కడ ప్రయోగించరాదు. పిండివంటలారగిస్తూ 'ఆకలి' అంటావేమిటి?

కవి :

అతని ఆకలి వేరు. అతనికి బ్రతకాలనివుంది! నాలుగు గోడల మధ్య మీ సరదాకోసం అతన్ని బంధిస్తే ఆకలి కాకేం చేస్తుంది! అతను కాలం వంటివాడు. ప్రవహిస్తాడు. భవిష్యత్తులోకి వెళ్ళేవాణ్ణి గతంలో పాతిపెడితే కృశించిపోక ఏం చేస్తాడు.

మహారాజు : విసుగుతో

కవిత్వం కట్టిపెడితే సంతోషిస్తాము.

బాలుడు : దీనంగా

మా అమ్మ ఒళ్ళోకి పోతాను. అమ్మను కొట్టారు. నన్ను ఖైదులో పెట్టారు. అమ్మ ఏడుస్తోంది అదిగో పిలుస్తోంది. పోనివ్వమని భటులతో చెప్పండి!

కవి :

ఆమె రోదన మీకు వినిపించడం లేదనుకుంటాను. స్వేచ్ఛగా అడవుల్లో తిరుగుతూ, పక్షులతో పసిపిల్లలతో ఆడుకుంటూ వున్న

ఆ స్వేచ్ఛా దేవిని తెచ్చి అంతః పురంలో చెరబెడితే ఆమె ఉక్కిరి బిక్కిరైపోతున్నది. ఆమె సంగీతంలో శోకం తప్ప మరొక స్వరం లేదు.

మహారాజు :

ఆమె ప్రసక్తి నాకు వద్దు. ఇవాళ నా కాలికింది భూమి కదులుతున్న ట్లుంది. మనస్సు సుడిగుండంలా గుంది. బిడ్డ అందంగా వుంటా డంటావా కవీ! అవిగో! మా పూర్వుల చిత్రాలు చూస్తే ప్రక్కనే రాజకుమారుని చిత్రం ఎప్పుడు అమర్చుతామా అని ఆందోళనగా వుంటుంది - ఎవరిదా ఏడ్పు!

బాలుడు :

అమ్మా! అమ్మా! వస్తున్నానే, బాలుడు పరుగెత్తుతూ వెళ్ళిపోతాడు.

కవి :

అతనిక్కడుండ లేడు. అతని తల్లి ఆమె. అతనికోసం ఆమెరొమ్ములు పాలతో పొంగుతున్నాయని ఒక రాత్రి గీతం పాడుతోంటే అప్పుడు తెలిసింది నాకు. తల్లిగుండె ఎంత క్షోభించిపోతుందో! మహారాజా! స్వేచ్ఛాదేవిగా జీవించే ఆమెను ఖైదులోవుంచి ఏమి సౌఖ్యమనుభ విస్తావు! ఇందులో కీడువుంది!

మహారాజు :

తెలుసు : గ్రహించాను. నా ఆస్థానంలో, అంతఃపురంలో జీవితం నీవల్ల కలుషితమౌతున్నది. నీగతి మాకు తెలుసు. రేపు ఉదయానికి నీకు తెలుస్తుంది. చనిపోయిన నీ పూర్వులకు గూడా తెలుస్తుంది. మంత్రి ఆదుర్దాగా వస్తాడు. నమస్కరిస్తాడు.

మంత్రి :

పట్నంలోకి వెడుతున్నాను. రాజకుమారుని జననం వేళకు నేనిక్కడుండకపోతే క్షమించండి. ప్రభుత్వం వుంటేనే మహారాజు వుంటాడు, మహారాజు పాలిస్తేనే మంత్రికి గతులు

మహారాజు : ఆతురతతో

ఏంజరిగింది? వైద్యులేమన్నారు? జ్యోతిషుడు రాడేమి?

మంత్రి :

క్షమాపణ వేడుతున్నాను. వైద్యుల సౌకర్యాలు చూచే వేళ కాదిది. దేశంలో ప్రజలు విప్లవంగా లేచారు. సైనికులకు ప్రజలకు మధ్య పోరాటాలు జరుగుతున్నాయి. మూడు తాలూకాలు,

ఆరు ఆయుధాగారాలు జనం వశమైనాయి. తుపాను రాజభవనం మీదికే బయలుదేరిందని ఇప్పుడే వార్త చేరింది. వ్యవధిలేదు. వాళ్ల నణిచి వస్తాను.

మంత్రి వెళిపోతాడు. పూర్వ రాజుల చిత్రాలు పరకిస్తూ నిలబడిన కవి చిత్రాల చివరివరకు వచ్చి, వేలితో అడ్డగీతలు గీస్తున్నాడు. రాజుచూచి నిర్ఘాంత పోతాడు. మెల్లగా కవి వద్దకు వచ్చి

ఏమిటా పిచ్చిగీతలు: మతిపోయింది నాకా నీకా! మూర్ఖులెవరో అల్లరి చేస్తే తుపానంటావేమిటి మంత్రి?

కవి: నిర్లక్ష్యంగా

తుపాను కాదు, జ్వాల! తుపాను వస్తుంది, పోతుంది. కాని జ్వాల ఒక్క సారిగా దహించివేస్తుంది. ఆమెను విడిచి పెట్టండి!

మహారాజు:

మనమే మహారాణి భవనానికివెళ్లి వద్దామా! [illegible] రాలేదేం!— ఆ ఏడుపు నేను [illegible]లేను. ఏడ్చేదెవరు? ఆ ఖైదీ యేనా?

కవి:

చూసివస్తాను.విశ్రాంతి తీసుకోండి.

మహారాజు: ఆవేశంతో

పరిచారకులెక్కడ?-ఆ ఖైదీనిటు తీసుకురండి! కవీ-ఆ ఏడ్పు నేను వినలేను. నాబిడ్డ సుకుమార మృదుకంఠం వినవలసిన క్షణాన, ఈ ఏడ్పు నేను వినను. ఆమెను ఉరితీయమని ఆజ్ఞాపిస్తాను.

కవి: నిశ్చేష్టుడవుతాడు

మహారాజు ఆజ్ఞలు ఎప్పుడూ ఎవరూ అతిక్రమించ లేదు-- ఇంతవరకు; కాని, ఎప్పుడూ అలాగే జరగదు!

మహారాజు: వస్తున్న స్వేచ్ఛాదేవిని చూసి

వచ్చింది! రాజభవనంసౌందర్యమయం చేస్తావని నిన్ను తెచ్చాను. హాయిగా కోటలోనే ఆడుకో పాడుకో మన్నాను. ఈ భవనం బంది ఖానా అన్నావు. నీశోకం నాకనేకసార్లు నిద్రాభంగం కలిగించి నా నిన్ను ప్రాణంతో వుంచాను. ఉదయించే రాజపుత్రుడు ఇక నీశోకం వినడు. నిన్ను ఉరితీయిస్తున్నాను.

బాలుడు భయభ్రాంతుడై పరుగెత్తుకుని వచ్చి ఆమె కౌగిలిలో ఒరుగుతాడు.

కవి:

మహారాజు నా కావ్యాలన్నీ వినే వున్నారు. కాని గ్రహించలేదు. వినేవి చెవులు, కాని ఆస్వాదించేది హృదయం. ఆ హృదయం యీ కోటలో లేదు.

మహారాజు : ఆగ్రహంతో

త్వరపడవద్దు : మీ ముగ్గురికీ చిత్రవధ తప్పదు.

కవి :

ఆ శోకం అప్పుడే కోట దాటి వెళ్ళింది. కొడిగట్టి నిర్జీవంగా పడివున్న లక్షల గుండెలలో జ్వలిస్తోంది. ఆ మంటలు వ్యాపించి పైబడి వస్తున్నాయి. మహారాజా! నీకు నిద్రాభంగం అయితే మమ్మల్ని నిందించకు. బాలుడికోసం వృద్ధులు మరణించవచ్చు - కాని బాలుడు బ్రతికి తీరాలి.

మహారాజు : మతిభ్రమించినవాడిలాగ అడుగులు వేస్తూ;

భటులెక్కడ! ఎక్కడ భటులు! ఎవరెక్కడ! వీళ్ళని నరికి కాకులకు, గద్దలకు వెయ్యండి! ఈమె పెను భూతంలా నన్ను భయపెడుతున్నది!

బైట-ప్రజల కోలాహలం, జయజయ నినాదాలు, తుపాకికాల్పులు వినిపిస్తాయి.

జ్యోతిష్కుడు: నిశ్శబ్దంగా ప్రవేశించి, చేతులు జోడించి.

నేను గుణించిన క్షణాన్నే సుపుత్రుడు ఉదయించాడు. రాజరేవి గల బిడ్డ ప్రాణం పడవకుండానే పరపుపడించాడు. అంతః పురం కల్లోలంగావుంది. వైద్యులు భయభ్రాంతులై పారిపోయారు. బిడ్డనే ను చెప్పిన క్షణాన్నే ఉదయించాడు.

కేకలు, నినాదాలు క్రమంగా దగ్గరగా బిగ్గరగా విన్పిస్తాయి. తుపాకి కాల్పులు, హాహాకారాలతో రాజభవనం దద్దరిల్లుతుంది.

మహారాజు : ఒళ్ళు తెలియని ఆవేశంతో

కవీ! విన్నావా! విన్నావా! ఎలాగ? నీ వేషకుం?

కవి :

నేను చరిత్ర కంఠాన్ని - తల్లీ బిడ్డల కోసం ప్రజలు వస్తున్నారు. ఈ క్షణంకోసం ఎన్నెళ్ళనుంచో ఎదురు చూస్తున్నాను నేను.

మహామంత్రి కుడిచేయి తెగి, రక్తం ధారలు కారుతూ వచ్చి, దూరంగా తలదించి నిలబడతాడు. ఓటమిని గ్రహించిన మహారాజు విభ్రాంతుడై మొదలు నరికిన చెట్టులాగ కూలిపడిపోతాడు.

బాలుడు :

అమ్మా! కోటకి పోయి ఆడుకుందామే.

కవి :

ఆమె దగ్గరకు వస్తాడు. బాలుని పరిష్వంగంలోకి చేర్చుకుని ఆమె చేయి పట్టుకుని లేపి ముందుకు నడుస్తాడు.

పిలుస్తున్నారు పదండి!

## సమీక్ష:

# తెలంగాణా స్వేచ్ఛాసంగ్రామ చరిత్ర



## నాటకం - నవల - కథలు

### మా భూమి

రచయితలు :

సుంకర సత్యనారాయణ
వాసిరెడ్డి భాస్కరరావు

వెల : రూపాయి

ప్రజాశక్తి ప్రచురణాలయం
బెజవాడ



సామాన్యంగా ఈనాడు మధ్య తరగతివార్ని ఆనందించే కళలను గురించి విమర్శకదృష్టి ఇట్లా ఉందంటే :

ఇ[illegible]లో కళ[illegible]యు[illegible] ప్రతిభ బాగా వ్యక్తమౌతున్నదా [illegible] దీన్ని [illegible] తను గొప్పవాడని మనం భావించుకోవచ్చా?— ఇది శిల్పం గురించి.

ఇందులో చిత్రించిన విషయాలు నమ్మదగినవేనా? ఇదంతా ప్రచారం కాదు గద?— ఇది విషయం గురించి.

మధ్యతరగతికి ఇటువంటి మనస్తత్వం ఉండటానికి ప్రబలమైన కారణాలున్నాయి. వాటి చర్చ మనకిక్కడ అనవసరం. ఈ మనస్తత్వం కళా విమర్శను ఏ ధోరణిలో నడిపిస్తుందో గమనించటమే మనకు కావలసినది. ఈ ధోరణివల్లనే కళా

---

(56 వ పేజీ తరువాయి) అభ్యుదయ కవిత్వం నేడు బయలుదేరింది. ఈ కవిత్వం పదిమంది కలసి పాడుకునే పాటలుగా గీతాలుగా పొంగి పొరలివస్తున్నది.

ఈ దశలలోని విభిన్న శక్తులూ, విభిన్న వర్గాలూ, వాని పోరాటమూ, అందుతో ఏర్పడిన మార్పులూ కవిత్వంలో- సారస్వతంలో ప్రతిబింబించాయి.

ఇప్పుడు మనం కేవలం చూచాయగా మాత్రమే తెలుసుకున్నాం. ఈ చరిత్రనంతా తర్వాత చిన్న చిన్న విభాగములుగా చేసుకుని, వివరంగా వీలునుబట్టి పరిశీలించుకుందాము.

కారుడి ప్రతిభకూ, దానివల్ల ప్రజలకు కలగగల ప్రయోజనానికీ మధ్య ఒక అగాధం ఏర్పడింది. ఒక నాటక కర్తగాని, నటుడుగాని, రచయితగాని, చిత్రకారుడుగాని ప్రతిభావంతుడు కావటమే ఒక పరమ ప్రయోజనం అయిపోయింది. ఆవిధంగానే కళావస్తువుకూ దానికి గల సాంఘిక ప్రాముఖ్యానికీ మధ్య ఇంకో అగాధం ఏర్పడింది. అది కలకాలం - దాని సాంఘిక ప్రాముఖ్యత చెల్లిపోయినాక కూడా - నిలబడి ఉంటుందా, ఉండదా అనేది ప్రధానమయింది.

దీని ఫలితంగా కళ అనేది జీవితాన్ని మరవటానికీ, జీవితం అపహరించే జీవశక్తుల్ని కూడగట్టుకొనటానికి టానిక్కు క్రింద వినియోగపరుచుకొనటానికి సాధనం.. పరిణమించింది.

ఇటువంటి మనస్తత్వమూ, విమర్శనా దృష్టి సంస్కరించటం అభ్యుదయోద్యమం యొక్క కర్తవ్యం. కళలు టానిక్కులు కావు. సంఘజీవులకు నిత్యాహారం. అవి ప్రజలలో కలిగించే ఉత్తేజాన్ని బట్టీ, ప్రత్యక్ష యదార్థ సమస్యల నెదుర్కొనే శక్తినిచ్చే సామర్థ్యాన్నిబట్టీ అవి సక్రమ ఆహారం అవునో కాదో అభ్యుదయ విమర్శకుడు నిర్ణయిస్తాడు.

దేశంలో పెచ్చుపెరిగిన ఆర్థిక కాటకం గాని, రాజకీయ సమస్యలుగాని అందరికీ సమంగా ప్రత్యక్ష యధార్థాలు కాకపోవచ్చు. శ్రేయసికోసం ఊహాగానం చేయటమే తారకమార్గమనే దృఢవిశ్వాసంగల వ్యక్తులూ, అల్పసంఖ్యాకవర్గాలూ దేశంలో ఉన్నారు. కాని ప్రజాసామాన్యం తీసుకున్నట్టయితే నిజాము రాష్ట్రంలో జరుగుతున్న ప్రజాపోరాటం ప్రత్యక్ష యధార్థ సమస్య. తెలంగాణా ప్రజలు మన ప్రజలకు భావబంధువులుకారు ప్రత్యక్ష సోదరులు. వారి బాగూ మనబాగూ వేరుకాదు. అందుచేత "మాభూమి" నాటకం చూసి బయటికివచ్చిన మరుక్షణం దాన్ని గురించి మరిచిమామూలు ప్రపంచంలోపడటం అసంభవం. ఒకవేళ యీ నాటకం చూడక మునుపు నిజాముప్రజాపోరాటాన్ని గురించి తగినంత ఆలోచించనివాళ్లెవరైనా ఉంటే వాళ్ళనీ నాటకం యదార్థ ప్రపంచంలోకి తీసుకువచ్చి అక్కడే ఉంచుతుంది. ఈ కారణంచేత ఈనాటకం చేసే ప్రచారం అత్యవసర ప్రచారం.

ఈ నాటకంలో వున్న పాత్రలు స్థూలంగా రెండు పక్షాలకు చెందినవే అయినా స్పష్టమైన వ్యక్తిత్వాలు కలవి. ఏపాత్ర "భాష" ఆపాత్ర మాట్లాడుతుంది. వీరారెడ్డి ప్రబోధకుడు. రామిరెడ్డి అనుమానం మనిషి. దాదా ఆత్మవిశ్వాసం తగినంతలేని పాతకాలపుసాధువు. సుభాన్ తొందరమనిషి. యల్లమంద ఆలోచించే బాపతుకాదు. [illegible] పక్షంలో కూడా జగన్నాధ[illegible] [illegible]. [illegible] తెలిసినమూర్ఖుడు. మస్తాను దేశముఖు చేతికర్ర. ఆఖరుకు సీతమ్మా, కమలా కూడా ఒకే పద్ధతికాదు.

ఇంత విస్పష్టమైన పాత్రలతోటి అభ్యుదయ శక్తుల స్వరూపాన్ని, అభ్యుదయ నిరోధక శక్తుల స్వరూపాన్ని చక్కగా చిత్రించారు నాటక కర్తలు. రైతు వర్గపు సంభాషణలన్నీ నినాదాలుగానూ, రాజ

కీయోపన్యాసాలు గానూ కనిపిస్తాయి. కాని ఆ నినాదాలూ, ఉపన్యాసాలూ వారి జీవితాలకి ఎంతో ముఖ్యమైనవి. తమజీవితాలను స్పష్టంగా అవగాహన చేసుకోవడంమీదే వారి ప్రాణాలూ విజయమూ ఆధారపడివున్నాయి.

ఈ నాటకంలో వ్యక్తుల కష్టసుఖాలకు కన్న ఉమ్మడిసమస్యకి ఎక్కువ ప్రాముఖ్యంవుండకపోవటం గుణమేగాని, లోపం కాదు. అయితే ఈ నాటకానికి వాస్తవికత్వం రావాలంటే ఈ పాత్రలు చాలవు: నాటకం మొదటినుంచి చివరవరకూ నలుగురే రైతులూ, ఒకడే దేశముఖురెడ్డీ, ఒకడే పోలీసుఉద్యోగీ రావటం నాటకానికి చాలా బలహీనం. ఏ వీరారెడ్డి జీవితమో నాటకానికి ప్రధానాంశమైతే ఇది పట్టి యివ్వకపోను.

సంభాషణల్లోనూ పాత్రల సంబంధాల్లోనూ నాటక రచయితలకు వాతావరణంతో గల పరిచయం చక్కగా వ్యక్తమవుతోంది. ఇంత గంభీరమైన నాటకంలో కూడా చక్కని సున్నితమైన హాస్యం ఉంది.

స్వరూపంలో [illegible] నాటకానికి ఆధునిక నాటక లక్షణాలు [illegible] దృశ్యాని కా దృశ్యం రక్తికడుతుందిగాని ముందు నడిచిన దృశ్యం వెనకవచ్చిన దృశ్యంతోటి చక్కగా అతకదు. మధ్య ఏఒకసీను ఎత్తివేసినా నాటకం ఆటే దెబ్బతినదేమో అనికూడా అనిపిస్తుంది. అదీగాక ఈ నాటకం "ముందడుగు" [illegible] కూచిపూడి భాగోతులకి [illegible] కాలక్షేపాలకూ [illegible] వారి [illegible] ఆధునిక నాటకానికి నప్పవు. నాటకంలో ఎన్నిరంగాలుండవలసిందీ, ఏ రంగంలో కథ ఏ పాకానికి రావలసిందీ కథను బట్టి నిర్ణయించాలిగాని ఒకే మూసలోవేసి అన్నికథలనూ తయారుచేయరాదు. ఈ నాటకం రాసిన సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావు గార్లు విషయం గమనించాలి.

—కొడవటిగంటి కుటుంబరావు



# మృత్యుంజయులు

రచయిత: బొల్లిముంత శివరామకృష్ణ

వెల: రూపాయిన్నర

ప్రజాశక్తి ప్రచురణాలయం

బెజవాడ



నైజాం నవాబు సాగిస్తున్న దురంతకపు పరిపాలనలో జమీందారీ, జాగీర్దారీ విధానాల సంకెళ్ళతో నలిగి, కుంగిపోతున్న తెలంగాణా సోదరుల చైతన్య గాథ యిది. ఇందులోని పాత్రలు వట్టి వ్యక్తులు కాదు. 90 లక్షల మంది తెలంగాణా సోదరుల ప్రతిమూర్తులు. తెలంగాణా పల్లెటిపట్టుల కరుణగాథను, వీరోచిత ప్రతిఘటనను సులభ సుందరమైన శైలిలో రచయిత చిత్రించాడు.

మల్లారెడ్డి కుటుంబం తెలంగాణారైతులోకానికి ప్రతిబింబం. ఎల్లారెడ్డి నూతన తెలంగాణా [illegible]. మహా[illegible] వేశపుల [illegible]నికి ప్రతిబింబం.

తెలంగాణాలోని ప్రజాపీడకులు రైతు యొక్క అజ్ఞానాన్ని, భయాన్ని తమ సంపదలు కూడబెట్టుకోనేటందు కుపయోగించుకొంటున్నారు. భార్యా బిడ్డలను చెరబెట్టడం లాంటి ఘాతుక చర్యలు కూడా భయవిహ్వాలములై యున్న వారి మనస్సులను తిరుగుబాటు స్థితికి తేలేదు. ఏ దశలోనయినా ప్రతిఘటించాలనే భావం ప్రజలలోకి వచ్చేస్తే, వెంటనే రైతాంగాన్ని మతకక్షలతో చీల్చి అణచివేస్తారు. దానికి నవాబు ముస్లిం కావడం వారి చేతిలో ఒక పెద్ద ఆయుధం.

కాని, నిప్పు ఎదటివాటినే కాకుండా ఆశ్రయించిన వాటిని కూడా దహించేస్తుంది. ప్రజాపీడకుల లోభదృష్టి ప్రజల నణచడంలో తాముపయోగించుకొన్న మతావేశపరుల పీకె కూడా పిసుకుతుంది.

ప్రజాపీడకుల కళ్ళుపడినది రాజాలు ఒక్కతే కాదు. 'బూడిదపట్టీ' వసూళ్ళ ద్వారా నైజాం నవాబు పరిపాలన పడిపోకుండా తన భుజస్కంధాల మీద మోసిన మహబూబ్ అన్న యొక్క కోడలు ఫాతిమాబీకూడ వారి లోలుప దృష్టులలో పడుతుంది.

తమదాక వచ్చాక, రైతాంగం, అన్ని మతాలవారూ కలియగలుగుతారు. ప్రతిఘటిస్తారు. ఫలితంగా జైళ్ళు, దెబ్బలకు గురిఅవుతారు. నేడు తెలంగాణాంతటనూ కదిల్చివేస్తున్న మహాపోరాటం ఆరంభమవుతుంది.

కాని, జీవితంఅంతా ఒకేపద్ధతిలో నడవదు. కొందరు క్లిష్టపరిస్థితులలో ఉక్కిరిబిక్కిరై కాలుచేతులు కదపలేరు. కాని పరిస్థితులు పక్వమై మార్గం గోచరించగనే నరల తెగించి పోరాడుతారు. మల్లారెడ్డి కొడుకు నర్సిరెడ్డికూడా జమీందారీ దుండగానికి గురౌతాడు. తనకు తెలియకుండానే ఎదురుతిరుగుతాడు ఆత్మరక్షణకు సహజంగా. కాని ఉద్యమం లేదు సంఘటనలేదు-మార్గంలేదు. ఏమీతోచక ఊరువదలి పరుగెత్తుతాడు. హైదరాబాదులో రిక్షా లాగుతాడు మిల్లుకూలీ అవుతాడు. కాని ప్రజాహింసా దేవత సర్వవ్యాఫి, సర్వగ్రాసి, మానవుని జీవితరంగాలన్ని దాని సామ్రాజ్యంలోని అంతర్భాగాలే. నర్సిరెడ్డి తిరిగివచ్చేస్తాడు. ఈమారు మాత్రం అతడు ఒక ఉద్యమభాగంగా చైతన్యంతో ప్రతిఘటించాలనే పట్టుదలతో వస్తాడు.

తెలుగులో మన ప్రజాజీవితాన్ని చిత్రించే నవలలే తక్కువ. అనువాద సాహిత్యం రానూడదనే దురభిమానంతో కాకపోయినా, తెలుగులో స్వతంత్ర రచనలు కరువౌతున్నాయే యని సారస్వతాభిమానులందరూ విచారించే స్థితి వున్న మన నాట 'మృత్యుంజయు..' కొత్త ఆశను రేకెత్తిస్తూంది

కనడను నవలా చూస్తే, కథ వస్తువును తీసుకొన్న ప్రదేశానికి కొత్తవాడనేది అక్కడక్కడ స్ఫురిస్తున్నా, తెలంగాణా ప్రజల పరిస్థితులను చక్కగానూ సహజంగానూ చిత్రించడంలో కృతార్థుడయ్యాడు. శివరామకృష్ణ గారి లేఖిని నూతన రచయితలకు ప్రోత్సాహకరంగా వుండగలదని ఆశిస్తున్నా.

—మహీధర రామమోహన్

# 'గెలుపు మనదే'

రచయిత: పర్చా దుర్గాప్రసాదరావు
ప్రాప్తిస్థానం:—అభ్యుదయ ప్రెస్,
గవర్నరుపేట, బెజవాడ.

★

ఇది ఏడు చిన్నకథల సంపుటి. గెలుపు మనదే, పన్నులు యివ్వం, గూండాలరాజ్యం, రెండుజండాలు, వడిశాల — యీ అయిదు కథలు సంస్థాన ప్రజాపోరాటంలో అతి ప్రాముఖ్య ఘట్టాలను చిత్రిస్తాయి. ముఖ్యంగా మన ఆంధ్రాకు సరిహద్దున వున్న తెలంగాణాలో యీనాడు అతి ప్రాముఖ్యమైన పోరాటం సాగుతున్నది. ఈ పోరాటంలో ప్రజా పక్షాలు యిచ్చిన కార్యక్రమాన్ని ప్రజ లెంత దీక్షతో, వీరోచితంగా నెరవేరుస్తున్నారో 'గెలుపు మనదే', 'పన్నులు యివ్వం', 'వడిశాల' ల్లో బాగా చిత్రించబడింది.

కొందరు— "ప్రభుత్వానికి ఆయుధాలున్నాయి; మీకేమున్నాయి" అంటారు, దానికి రచయిత "చల్లని నీళ్ళమీద దాడి చేస్తే నిప్పు [illegible]" అని జవాబిచ్చారు (పే. 4)

'గూండాలరాజ్యం' అనే కథ వరంగల్‌లో డాక్టర్ [illegible]రెడ్డిని 'యున్లిమిూ' గూండాలు పొడిచిన విషయాన్ని గుర్తించుకొని వ్రాశారేమోనని తోస్తుంది. కాని కష్టకాలంలో తన కూతుర్ని మందు, పైగా డబ్బు యిచ్చి బ్రతికించినా, 'గూండా, యైతం డ్రే డాక్టర్‌ని పొడిచినట్లు రచయిత చిత్రించారు. కాని యీనాడు జరుగుతున్న పోరాటంలో ఏకొద్దిమంది మహమ్మదీయులైనా మనపట్ల వుండక పోలేదు. స్వాభావికంగా కథలో తండ్రి అలా ప్రవర్తిస్తాడని సామాన్యవిషయంగా (generalise) చేసి చూపిస్తే అంతసైజంగా తోచదు.

'రెండుజండాలు' అన్న కథలో నేడు, పోరాటానికి పునాదిలాంటిదైన కాంగ్రెస్ కమ్యూనిష్టు ఐక్యత, యీ ప్రయత్నంలో కొన్నిచోట్ల జరుగుతున్న సాఫల్యాన్ని మెలకువతో చిత్రించారు,

'బియ్యంగింజలు' అన్నకథ ప్రఖ్యాత రచయిత అబ్బాస్‌ది. రచనయొక్క కళా ప్రాశస్త్యం కించిత్తు తగ్గకుండా అనువదించారు.

'కవి దరిద్రుడు' — ప్రేయసమీద గేయాలు వ్రాసినా కష్టజీవుల 'ఘర్మజలం' ప్రవంతిగా ఆలపించినా కవి దరిద్రాన్నే అనుభవించాడని రచయిత వ్రాశారు. కాని మన కళ్లముందు ఆంధ్రదేశంలో ఎంత మంది డబ్బుగలవాళ్లు స్వలాభానికి కవులను ఉపయోగించుకోటంలేదు? కష్టజీవుల కృతనిశ్చయం చిత్రిస్తే కష్టజీవులు [illegible] గంజిలో ఓగుక్కెడు, అతన్ని [illegible] పరిగణించిఇస్తూ నేవున్నారు.

ఈమధ్య వెలువడిన కొద్ది అభ్యుదయ కథలలో ఈ సంపుటి ఒకటి. ఇది ప్రతివారు చదివి సంస్థానాల్లోని మన సోదరుల జీవిత పోరాటానికి సహాయం చెయ్యాలి.

— సి. వి. కృష్ణారావు




*Producers :*

Swatantra

Films Ltd.,

T. NAGAR,

MADRAS





ఆంధ్రా - సీడెడ్:

ప్రీమియర్

ఫిలింస్ లిమిటెడ్,

గవర్నరుపేట,

బెజవాడ



మైసూర్ - కుర్గు:

రాఘవేంద్ర పిక్చర్సు

గాంధినగర్

బెంగుళూరు



## జనవరి 9 నుంచీ రెండవ వారం



1948 జనవరి

2వ

తేదీన

ఆంధ్రదేశమంతటా

విడుదల






భరణీ వారి

# రత్నమాల

భానుమతి...సి.యస్.ఆర్.
డాక్టర్ సుబ్బారావు...ఆరణి
హేమలత...నాగేశ్వరరావు

డైరెక్టర్...రామకృష్ణ

Songs & Dialogues..SAMUDRALA...Music..SUBBARAMAN . Dances..RAGHAVIAH...

బెజవాడ
లక్ష్మీటాకీస్

కాకినాడ
మెజస్టిక్

రాజమండ్రి
మినర్వా

విజయనగరం
పూర్ణా

విశాఖపట్నం
పూర్ణా

బందరు
బృందావన్

గుంటూరు
న్యూసిటీ

తెనాలి
సత్యనారాయణ

ఏలూరు
రాధాకృష్ణ

కర్నూలు
చాంద్



నిర్మాతలు: భరణీ పిక్చర్సు, మద్రాసు 17

పూర్ణా పిక్చర్సు వారి రిలీజు

Wrapper Printed at Universal Printers, Bezwada